# గీతాహృదయమ్

( జ్ఞాన యోగము )


ఆర్షధర్మ ప్రబోధక - పండిత

నండూరు సుబ్రహ్మణ్యశర్మ



ఆర్షవిజ్ఞాన గ్రంథమాల

సత్యనారాయణపురం

శివాలయం వీధి * విజయవాడ-11.

పునర్ముద్రణ :

1991, సెప్టెంబరు

ప్రతులు : 1000



వెల రు. 16/-

ముద్రణ : శ్రీ రాఘవేంద్ర ప్రింటింగ్ వర్క్సు
శ్రీదేవి బార్ వెనుక, రామకృష్ణాపురం, విజయవాడ-3

# వి జ్ఞ ప్తి

పా ఠ కు లా రా !

భారతీయాధ్యాత్మిక గ్రంథమండలికి అధ్యక్షస్థానము నలంకరించి, పాశ్చాత్య పీఠములకును పీఠాధిపత్యము నొందిన ఈ గీతాశాస్త్రము నెందరో మహనీయులు వ్యాఖ్యానించి యున్నారు. ఎందరెన్నివిధముల వ్యాఖ్యా నించినను పదార్థమొక్కటేయయ్యును పాచక భేదమున రుచిభేదముండుట సహజముగదా ?

భారతీయ వేదాంతము నంతను సంగ్రహించి, సూత్ర ప్రాయముగా నందించిన ఈ గీతాశాస్త్రము, అందు పేర్కొనబడిన కర్మ, భక్తి, జ్ఞానము లను యోగత్రయమును కథాకథనమువలె వరుసగా శ్లోకములు నందించక పదునెనిమిది యధ్యాయములందును అక్కడక్కడ ప్రసంగ వశమున మాటి లాడు విషయముగా వర్ణించినది. కావున పాఠలోకము పారాయణ క్రమము ననుసరించి ప్రత్యేక యోగములను గుర్తించి, యే యే శ్లోకములు యే యే యోగములను ప్రతిపాదించినవి ? లేక యోగత్రయమునకును సమిష్టి సాధన భాగములైన శ్లోకములెవ్వి ? అను విభాగమును నిర్ణయించు కొనుట కష్టమనియెంచి, నేను ఆయా యోగసిద్ధాంత సూక్తులైయున్న శ్లోకముల సంగ్రహించి, భారత భాగవతాది ఇతిహాసముల నుండియు, ఉపనిషద్వ్యాస సూత్రముల నుండియు ఉదాహరణలనిచ్చి, ప్రత్యేక యోగ

ముల పదిప నుపన్యసించుచుండగా గీతలోని సిద్ధాంతములు వారి హృదయము లందు హత్తుకొనెనేమో శ్రోతలైన వారందరును దీని నావిధముగనే యచ్చొత్తించ ప్రేరేపించిరి. అదియే దైవ సంకల్పమని భావించి నేనా శ్రోతల సత్సంకల్పముననే ఈ గీతాహృదయమును గోష్ఠి రూపమున వెలువరించ గలిగితిని.

ఈ జ్ఞానయోగగ్రంథమును పరిశీలన కందించగనే శ్రమయనక సాకల్యముగ పరికించి, యభిప్రాయ మొసంగిన బ్రహ్మవిద్యాలంకారేత్యాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ మదిగొండ వెంకటరామశాస్త్రిగారికిని, నాకత్యంతాప్తమిత్రులైన శ్రీమాన్ కో. వెం. కృష్ణమాచార్యులుగారికిని నా కృతజ్ఞతాభి వందనముల నర్పించుచు, తెలుపుచూ నా విజ్ఞప్తి నింతతో విరమించుచున్నాను.

ఇట్లు

విధేయుడు

గ్రంథకర్త

# పండితాభిప్రాయములు

ఓమ్

శ్రీ సద్గురుశ్శరణమ్

## గీతాహృదయము

బ్రహ్మవిద్యాలంకార

బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకట రామశాస్త్రిగారి

-: ఆశీస్సులు :-

శ్రీ చిరంజీవియగు "ఆర్ష విజ్ఞాన ప్రబోధక" నందూరు సుబ్రహ్మణ్యశర్మగారు గీతాహృదయము - మూడవ భాగమును రచించి ముద్రింపించి నాకు సమర్పించగా చూచి మిక్కిలి యానందించితిని.

ప్రస్తుతము గీతాహృదయములో నీ మూడవ భాగము పరిశిష్టమగు జ్ఞానయోగమై విరాజిల్లుచున్నది.

ఈ గీతాహృదయమంతయు పాఠక సౌకర్యార్థమై గురు శిష్యులను కృష్ణానంద - విజయుల గోష్ఠిరూపమున చిత్రితమైయున్నది.

అందు మొదటి కర్మయోగములో నాల్గు ప్రకరణములు, రెండవ భక్తి యోగములో నేడు ప్రకరణములు, ప్రస్తుత జ్ఞానయోగములో నైదు ప్రకరణములు కలవు.

ఈ జ్ఞానయోగములోని 1 యోగ ప్రశస్తి, 2 ప్రయత్నము, 3 సాధనలు, 4 ఉపదేశము, 5 స్థితప్రజ్ఞులు అనే నామములాయా ప్రకరణములకు సార్థకములుగ నున్నవి.

మరియు నీ గ్రంథములో ననేకోపనిషద్వచనములు, బ్రహ్మసూత్ర వచనములు, ప్రస్తుత గీతావచనములేగాక, యోగవాసిష్ఠోక్తులు, శాంకర భాష్యసూక్తులు, శాంకర దక్షిణామూర్తి స్తోత్రశ్లోకములు, విద్యారణ్య పంచదశి శ్లోకాదులే గాక ఆంధ్ర భారత భాగవతాది హృద్య పద్యములు సమయోచితములుగ నుదాహృతములై యున్నవి.

ఇంతేగాక నీమైదు ప్రకరణములలో ననురూపములగు వివిధో పనిషదగాథలు, పౌరాణిక గాథలు - కాళిదాసు మొదలు ఋషభునివరకు జ్ఞానయోగ సాధక భూమికలలోను, సిద్ధ భూమికలలోను పాఠక హృద యాకర్షకములుగ నున్నవి.

భగవదనుగ్రహమున వీరికి చిరాయురారోగ్యైశ్వర్య భాగ్యము లవిచ్ఛిన్నముగ గల్గి, గీతాహృదయము - జ్ఞానయోగమునుకూడ నిట్లు సుమనోమనోహరముగ, పండిత పామర రంజకముగ రచించినందుకు నా యానందమును వెలిబుచ్చుచు మన శర్మగారు తమ "ఆర్ష విజ్ఞాన ప్రబోధక" బిరుదమును సార్థక పరచున నిట్టి సద్గ్రంథ ప్రచారములతో తమ ధార్మిక పవిత్ర జీవికతో నిఖిలాంధ్ర జనతానంద సంధాయకులగు చుందురు గాకయని యాశీర్వదించుచున్నాను.

మకాము
త్రిలింగ మహా విద్యాపీఠము
విజయవాడ-2.

ఇట్లు,
సర్వ శ్రేయోభిలాషి
ముదిగొండ వేంకటరామశాస్త్రి.

## శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

బ్రహ్మశ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మగారు రచించిన జ్ఞానయోగము నేడు ముద్రితమై వెలువడుచున్నది. వారొకప్పుడు శ్రీమద్రామాయణమును (వాల్మీకీయమును) మనకు వినిపించి యానందరూపమగు రసాత్మక పరబ్రహ్మమున లీనమొనర్చిరి. ఆవల భారతమును శ్రీ భాగవతమును బోధించిరి. భారతసారమే భగవద్గీత. పదునెనిమిది పర్వములు. పదునెనిమిది యధ్యాయములు. మొదటి యధ్యాయము ఇతిహాసాంశము. మిగిలిన పదునేడధ్యాయములు తత్త్వాంశము. "భారతం పంచమోవేదః" అను సూక్తికి నిదానము.

శ్రీ శర్మగారు మహనీయులగు శ్రీ శంకర భగవత్పాదాది నానా తత్త్వవిదుల బోధలను కూలంకషముగా అధిగమించిరి. తత్ఫలితముగా షట్కత్రయిని ప్రధానీకరించి, ఆయా ఆయా అంశములను జతపరచి కర్మ, భక్తి, జ్ఞానయోగముల వేరుపఱచి శ్రవణపేయ మొనర్చినట్లే నేత్రపేయము నొనర్చుచున్నారు. కృష్ణ విజయులు ఇందు పాత్రధారులు. విజమునకు వారు పాత్రధారులై కదా శోక మోహములను కల్పించుకొని మన శోక మోహముల నున్మూలించినారు. జ్ఞానయోగము శంకర భగవత్పాదుల ముఖ్య సిద్ధాంతము. శ్రీధరాదులు దీనినే భక్తియోగమనిరి కాని వీరి భక్తియోగమునకును శ్రీమదాచార్యస్వామివారి జ్ఞానయోగమునకు భేదములేదు. ఆ విషయమును శ్రీ శర్మగారు మన కనులయెదుట నుంచి వివరించినారు. ఆధ్యాత్మిక తత్త్వము కరతలామలకమైనది. తెలియని దానిని "అద్వైతముగా నున్నది" అని లోకవాడుక, తెలిసినదే యద్వైత

మని ఈ గ్రంథము చాటుచున్నది. సమన్వయము బోధనాచాతురి కృష్ణా-
వంతుని యందు ప్రతిబింబించినది. "నన్యస్య శ్రవణం కుర్యాత్" అను
వివరణకారుని సిద్ధాంతము బోధకునియందును, "శాంతోదాంత ఉపరత
స్తితిక్షుః" అను గుణగణము గృహస్థుడగు విజయునియందు స్ఫురించు
చున్నవి. విజయ కృష్ణులు, లేక కృష్ణద్వయము, ఈ సుబ్రహ్మణ్యుని
ప్రేరేపించి మనకు తత్త్వబోధచేయింప ప్రేరేపింతురు గాక యని యా-
యుభయుల వేడుచు విరమించుచున్నాను.

విద్వద్విధేయుడు,

కో. వెం. కృష్ణమాచార్యులు.

(Retd)

ఓరియంటల్ కాలేజి లెక్చరర్.

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# గీ తా హృ ద య ము

## యో గ ప్ర శ స్తి

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ 4-34

అజ్ఞాన నిద్రనుండి మేల్కొనని మానవ సమాజమును నిద్రనుండి మేల్కొలిపి జ్ఞానప్రబోధమును గావించునదే భగవద్గీతాశాస్త్రము. ఈ ప్రకృతియం దొకవిచిత్రము లేకపోలేదు. ఎక్కడినుండియో వయనమై మానవుడీ ప్రకృతిలోనికి వచ్చెను. ఆ ప్రకృతి కెందుకీ మానవసమాజమును మోహ సముద్రమున ముంచవలె నన్న కుతూహలము? ఎందుకో కలిగినది. అది ఆమెకు ఆట గావచ్చును. మానవుడీ ప్రకృతిలోబడి సుడిగుండములోని కీటకమువలె భ్రమించుచుండెను. ఈ మానవకీటకమును ఒడ్డున వేయువారెవరు? స్వార్థరహితులెవ్వరో రావలెను. స్వార్థరహితు లెవ్వరు ? భగవంతుడు, ఆయనను చుట్టియున్న మహనీయులు. అంతియే! కావుననే కరుణాసముద్రులైన గీతాచార్యులు ప్రబోధించుచున్నారు. నాయనా! నిద్రనుండి లెమ్ము. నేనెందుకీ ప్రకృతి సుందరి ఒడిలోనికి వచ్చితిని? విచారించుకొమ్ము. నీకెందుకు వచ్చినదీ గాఢనిద్ర! నీకీ మాయాసుందరి యేదియో మత్తు మందునిచ్చినది. తెలిసికొమ్ము. నీ కర్తవ్యమును గుర్తె

రుగుము. ఇంతకుముందు నీ మజిలీ ఎక్కడ? నిన్ను నీవు పరిశీలించు కొనుము. నేనింతకు ముందుకూడ ఈ ప్రకృతి బాహుబంధమునసే ఉంటిని నావ్యవస్థానమిదియే, అని తలపకు. ఈ జననము నీకు మధ్య మజిలీ.

ఈ ప్రకృతి నిన్ను కట్టివేసినది. ఈ ప్రకృతి సుందరి మోహమున పడకు. నీవు నా బిడ్డవే. నిన్ను మేల్కొలిపి సముద్ధరించుటకే వచ్చితిని. అదుగో నీ నిజమైన మిత్రుడు. ఇదిపరలో నీవెంబడనంటి ఉన్నవారు నీ నిజమిత్రులుకారు. వారు దుష్టమిత్రులు. వారితో కలసి మెలసి యుండుటే నీకీ జననమునకు కారణము. ఆ దుష్టమిత్రులను వదలుము. నేనందించిన మిత్రుడను నమ్ముము, అని ప్రబోధించుచున్నది గీతాశాస్త్రము. కాని ఆ ప్రబోధములు సూత్రప్రాయములు. మందబుద్ధులు కేవలము సూత్రములై విలసిల్లు గీతాశాస్త్ర ప్రబోధముల నందుకొనగలరా? కావుననే భారతీయ పారస్వత చక్రవర్తులైన మతాచార్యులీ భగవద్గీతాశాస్త్రమును వ్యాఖ్యానించిరి. ఆ వ్యాఖ్యాతలలోనివారే జగద్గురువులైన శంకరాచార్యులు. వారి శిష్యకోటిలోనివారే కృష్ణానందులును వారి శిష్యుడు విజయుడు కూడ.

పాఠకులారా!

కృష్ణానంద విజయులిద్దరు మీరెరుగనివారు కారు. గీతా హృదయమును పరిశీలించు వీరిద్దరును కర్మయోగ భక్తియోగములను గురించి చక్కగ విశదీకరించిరి. ఇప్పుడు జ్ఞానయోగ ప్రతిపాదనకు మరల వీరిద్దరూ గోష్ఠిపీఠము నలంకరించినారు. గీతా శాస్త్రమునకు జ్ఞానయోగము తలమానికము గదా?

అది సాయంకాల సమయము. కృష్ణానందులు గురుపీఠమున జ్ఞాన ముద్రను ధరించి నిమీలితనేత్రులై కూర్చొనిరి. జ్ఞానముద్రకు అర్థము జీవబ్రహ్మైక్యము. (పెద్దవ్రేలును చూపుడువ్రేలును కలుపుట)

విజయుడు వారి కభిముఖుడై దోసిలి శిరమునందుంచుకొని వినమ్ర భావమున నిలిచియుండెను. కొన్ని క్షణములు గడచినవి. కృష్ణానందులు నేత్రములను తెరచిరి విజయుడు గురుపాదములపై వ్రాలి వందన సమర్పణ మీక్రింది గీతమున గావించెను.

శ్లో॥ విశ్వం దర్పణ దృశ్యమాననగరీ తుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా
య స్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మాన మేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

విజయుని దృక్పథమున గురువర్యులు దక్షిణామూర్తియై సాక్షాత్కరించుచుండెను. కావుననే జగద్గురువులు గావించిన దక్షిణామూర్తి స్తోత్రములోని ప్రథమ శ్లోకమున ప్రణామము గావించి గురువుల యనుజ్ఞతో కూర్చొనెను. తరువాత వారిద్దరికిని ఈ క్రింది సంభాషణ జరిగినది.

వి - గురువర్యా! గీతాశాస్త్రమునందలి కర్మయోగ భక్తియోగములను గురించి విశదీకరించితిరి. జ్ఞానయోగమును కూడ ప్రసాదింపుడని నా ప్రార్థనము.

కృ - నీ ప్రశ్నయేగదా! మనగోష్ఠికి ప్రారంభము ?

వి - చిత్తము. కర్మయోగమున నేను భగవంతుని సేవకుడను అనుకొనుచు, వేదశాస్త్ర బోధితములైన కర్మలను నిష్కామ బుద్ధితోడనే

ఆచరించి కర్మఫలములను భగవంతునికే సమర్పించుట గీతాశాస్త్ర సారమని నిర్వచించితిరి.

తరువాతది భక్తియోగము. అందు స్వామీ అని భగవంతున కెదురై ఆయనతో సంభాషించదగిన అర్హతను సంపాదించుకొని నేను నీవాడనే అని ఆర్తుడవై భగవంతుని తండ్రిగా భావించి, పుత్రధర్మముల నీవు గ్రహించి ఆయన వాత్సల్యమునకు పాత్రుడవై వాత్సల్యభక్తియను శైశవము దాటగా భగవంతుని మిత్రునిగా గ్రహించి, మైత్రితో మిత్రభావమునొంది, అత్యంత సన్నిహితుడవై సఖ్యభావమున ఆనందించుచు సాధన భాగమున సఖ్యభక్తి నధిగమించి ప్రౌఢత్వము రాగా సఖీభావమున మధురమూర్తియైన భగవంతుని మనమునందిరికి ఒడిలో మెదగుచు, గోపాంగనల చందమై, రాధనుబోలి భగవద్విరహమును భరించలేని మధుర భావమునొంది, జీవేశ్వరుల సేవ్యసేవక భావమున శరణాగతుడవు కావలసినదిగా గీతాశాస్త్రము ప్రబోధించినదని నిర్ణయించితిరి.

మరి జ్ఞానయోగమున జీవుడనైన నేను భగవంతునితో ఎట్టి సంబంధమును కలిగి యుండవలెనను నదియే నేటి నా ప్రశ్న.

శ్రీ - నీ ప్రశ్న చాల యుక్తము. ఈ యోగమున నీకు జీవత్వము పోవలెను. బ్రహ్మత్వము రావలెను. జీవేశ్వరు లొక్కటగుటయే జ్ఞానయోగ సిద్ధాంతము. దీనినే జీవ బ్రహ్మైక్యమందురు. ఈ సిద్ధాంతమునే గీత చెప్పినదని శంకరులు నిర్ణయించిరి. జీవేశ్వరుల సేవ్యసేవక భావము భక్తియోగమున సంపూర్ణమగును. రాధాకృష్ణు లిరువురును, వేర్వేరుగా లేక "ఏకమే వా ద్వితీయమను" శ్రుతికి లక్ష్యమగుదురు. అంతతో భగవంతునకు భక్తునకు మధ్య

నున్న తెరతెగి వారిద్దరు నేకమగు కాలము వచ్చును. ఆ కాలము వచ్చువరకును తీగ వృక్షమును చుట్టుముట్టినట్లు భగవంతునకు తనకు ననన్యభావమును భావించుచు వచ్చి వచ్చి జ్ఞానయోగమున నదులు సముద్రమునందు ప్రవేశించగనే తమ తమ నామరూపములను కోల్పోయి సముద్రుని స్వరూపమే అగునట్లు తన జీవభావమును కోల్పోయి జీవుడు బ్రహ్మభావమును పొందును. అదియే అద్వైతాచార్యుల సిద్ధాంతము.

వి - నాకొక్క సందేహము

కృ - అడుగుము.

వి - సామాన్యముగ యజమాని తన స్థానమును సేవకున కిచ్చునా? అట్లే ఆయనను సేవించు జీవుడు భగవంతుని సింహాసనము నలంకరించుటకు స్వామివారనుగ్రహించునా అని.

కృ — ఇక్కడనేయున్నది చమత్కారము. అసలు భగవంతునకు తాను వేరై యుండుట కిష్టమేమాత్రము కూడ నుండదు తెలియునా?

వి - గీత ఆ మాటను చెప్పినదా?

కృ - గీత చెప్పనిది శంకరులందురా?

"జ్ఞానీ త్వాత్మైవ మే మతం"

ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః" 7–17

జ్ఞాని అనగా వేరొకరుకాదు. నేనే జ్ఞాని. జ్ఞానియనగా నేనే. నాకత్యంత ప్రియుడు జ్ఞాని. జ్ఞానికి ప్రియమగువాడను నేనొక్కడనే అని గీతాశాస్త్రము చెప్పినది.

వి - జ్ఞానికిని భగవంతునకును మధ్య వేరొక తెరయే లేదన్నమాట.

ఉ - అవును. ఆత్మయే భగవంతుడు. భగవంతుడే ఆత్మ. భగవంతుడు, ఆత్మ, అను పదములు వేర్వేరు పదములుగావు. అవి రెండును ఏకార్థబోధకములేనని ఉపనిషత్సారస్వతము నిర్ణయించుచున్నది. ప్రియమైన వస్తువులలో ఆత్మకంటె ప్రియమైన వస్తువులేదు. ఎవరు ఎవరిని ప్రేమించినను, లేక ఏపదార్థము నెవ్వరు ప్రేమించినను తన ఆనందము కొరకే ప్రేమింతురుగాని తనకు ఆనందమును చేకూర్చని వ్యక్తినిగాని, పదార్థమునుగాని ఎవ్వరును ప్రేమించరు. కావుననే ఆత్మ పరమప్రేమ రూపమైనదని ఉపనిషత్సారస్వతము నిర్ణయించినది. భగవంతునికూడ పరమ ప్రేమస్వరూపుడనియేవాడినది. జ్ఞానియగువాడు భగవంతుడన వేరులేడు, నేనే భగవంతుడను అనుకొనును. తన ఆత్మవేరు భగవంతుడు వేరు అని తలచడు. అప్పుడు భగవంతుడుకూడ తానువేరు జ్ఞానివేరు అని భావించడు. ఈ విధముగ నిద్దరును ఒకరినొకరు ఏకైకాత్మముగా భావించుటచేత జ్ఞాని భగవంతుడును, భగవంతుడు జ్ఞానియునై ఆ రెండు పదములును ఏకార్థ బోధకములైనవి. వారిద్దరును ఆత్మీయులు అన్న సామాన్య సూక్తియు ఈ అఖండార్థములోని ఛాయయే. ఇట్టి జ్ఞానము ఒకే ఒక జన్మకు ఫలింపకపోవచ్చును. శ్రీకృష్ణులు –

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే॥ 7–19

అని బహుజన్మలకు వ్యవధి నొసంగిరి. కాలపరిమితిని విధించలేదు. "సమహాత్మాసుదుర్లభః॥" అనువంటి జ్ఞానమును సంపాదించుకొన్న మహనీయుడు చాల దుర్లభముకూడ. అట్టిజ్ఞానమునకు ప్రయత్నించు వారే చాల అరుదని స్వామి పల్కించినారు.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 7-3

ఆత్మజ్ఞానమును సంపాదింప ప్రయత్నము సలుపువారు కొన్ని వేల మందిలో నొక్కరుందురు. అందును సిద్ధులుకాదగినవారు ఒక్కరు తేలుదురు. ఆ సిద్ధులలో కూడ ప్రథమ శ్రేణికి చెందిన వాడొక్కడే యుండునని పై శ్లోకము నిర్ణయించుచున్నది.

వి - వాసుదేవ బ్రహ్మశబ్దములు ఒకే అర్థమును బోధించునా? వేర్వేరు భావములనిచ్చునా?

కృ - సమస్త వాఙ్మయమును బ్రహ్మయను పదమునందే అన్వయించును. బ్రహ్మపదమును ఉపనిషత్తులువాడినవి. వాసుదేవ పదమును వాడి నవి. ఆ పదములు రెండును భిన్నార్థకములుకావు. వాసుదేవ శబ్దమునకు వసుదేవుని పుత్రుడు వాసుదేవుడని మాత్రమే అర్థము కాదు. సర్వవ్యాపకమై ప్రతిపరమాణువును అతనికంటె వేరు కాదు కనుక వాసుదేవుడని అర్థము.

శ్లో॥ వసనాత్ సర్వభూతానాం వసుత్వాద్దేవ యోనితః।
వాసుదేవ స్తతో వేద్యః బృహత్వా ద్విష్ణురుచ్యతే॥
భార ఉ ప. 70.అ.

అతడు సర్వవ్యాపకుడు కనుకనే విష్ణువను పేరుకూడ వచ్చినది. భగవంతునకు జ్ఞానికిని గల ప్రేమసంబంధమును గురించి ఒక చక్కని కథను చెప్పెదను.

భోజమహారాజుగారి సంస్థానమున దండి, భవభూతి, కాళిదాసను మహాకవులు ముగ్గురుండేవారట. ఒకప్పుడు రాజుగారి కోరిక

ననుసరించి వారు ముగ్గురును ఒకే విషయమును వర్ణించిరట కాని మహారాజు కాళిదాసునకే స్థానమివ్వగా మిగిలిన యిరువురును రాజు గారి నిర్ణయము పక్షపాతమనిరి. అప్పుడు నిష్పాక్షిక నిర్ణేతలెవరు? పరమేశ్వరియే. ఆమెనే వారు ముగ్గురును సమీపించి నిర్ణయింప మనిరి. ముగ్గురు కవుల శ్లోకములను ఆమె ఒక త్రాసునందుంచి నది. కాళిదాసు శ్లోకమునకంటె మొగ్గలేదు సరికదా సమానముగా నైనను వారి శ్లోకములు తూగలేదు. అప్పుడామె "కవిర్దండీ కవిర్దండీ" యని, "భవభూతిస్తు పండితః" యనెనట మరి నేనెవ డను? అన్నారు కాళిదాసు. "త్వమేవాహం త్వమేవాహం త్వమే వాహం నసంశయః" అని నిర్ణయించినదట. భగవంతుని సింహా సనము భక్తున కిచ్చినదందువా? లేదందువా?

వి - చక్కగా విశదమైనది.

కృ - శ్లో॥ స్నాతం తేన సమస్తతీర్థనిచయే సర్వాచదత్తావనిః
యజ్ఞానాం చ కృతం సహస్రమఖిలా దేవాశ్చ సంపూజితాః
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితరః త్రైలోక్య పూజ్యో వ్యసౌ
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్॥

ఎవడు ఆత్మజ్ఞానియో అతడు సమస్త తీర్థములందును గ్రుంకులిడిన వాడగును. అఖండ మహీమండలము నంతను దానముచేసిన దాతకూడ నతడేయగును. సమస్త యజ్ఞములను నెరవేర్చిన యజ్వాయన నతడే. దేవతలందరును అతని ఆతిథ్యముననే తృప్తులగుదురు. పితృదేవతలును అంతియే, త్రిలోక పూజ్యుడు జ్ఞానియొక్కడే. బ్రహ్మవిచారము నొక్క క్షణకాలము గావించిన వాని గురించి వర్ణించినది శ్లోకము. బ్రహ్మనిష్ఠులైన వారి సంగతి

చెప్పునదేమున్నది. ? గీతాచార్యులిచ్చిన సందేశమునుకూడ వినిపించెదను.

"ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మ నిర్వాణమృచ్ఛతి. 2-72

జ్ఞానియొక్క ఉనికికే బ్రాహ్మీస్థితి యనిపేరు. ఇట్టిస్థితి చివరకు శరీరత్యాగసమయమునందు కలిగినను చాలునని నిర్ణయించిరి.

వి - ఆత్మజ్ఞాన సంపద వరించుట కెంతయో కాలమక్కరలేదన్నమాట.

కృ - అక్కరలేదు. ఖట్వాంగ మహారాజున కొక్క రెండు ఘడియల కాలముననే వైరాగ్యమువచ్చుట, జ్ఞాన నిష్ఠుడై మోక్షము నొందుట జరిగినది.

అందువలననే జ్ఞాననిష్ఠను శ్రీవారు బహుముఖముల కొనియాడిరి.

వి - ఆ శ్లోకముల నందింతురా ?

కృ - తప్పక అందింతును.

"అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥ 4-36

ఆత్మజ్ఞానమను నదీ ఒక నావ. సంసారము పాపమూలము. పాప సంచయము బహుజన్మార్జితమైనది. పాపలేశములే కామాంకురములు. కామ వాసనలు నిర్బీజములైన గాని వినిర్మలమగు ఆత్మజ్ఞానము భాసింపదు. ఆత్మజ్ఞానము రూఢమైనగాని పాప బీజములను నిర్మూలములుగావు. కాని యీ శ్లోకమున పాపమొక మహా సముద్రముగను, మహా ప్రవాహముగను వర్ణింపబడినది. పాప

ములు రెండు విధములు. ప్రాయశ్చిత్తములతో అంతమొందునవి. ప్రాయశ్చిత్తములు కూడ నశింపచేయజాలనివి. ప్రాయశ్చిత్తములకు సాధ్యములు కానివి సముద్రములవలె అంతులేని వైయుండును. ప్రాయశ్చిత్తములచేత క్షయము నొందునవి ప్రవాహములవలె నుండును. ప్రవాహములను దాటించునవి సామాన్యములగు నావలు. సముద్రములను దాటించునవి ఓడలు.

ఈ శ్లోకమున "సర్వేభ్యః పాపేభ్యః అనుటచేత ప్రాయశ్చిత్తరూపమగు కర్మకాండ దాటింపరాని పాపార్ణవమును కూడ జ్ఞాన ప్లవము దాటించునని వర్ణించిరి. "పాపకృత్తమః" పాపముల నాచరించిన కర్తకు కూడా అభయ ప్రధానమిచ్చిన దీ శ్లోకము. అవ్వలిఒడ్డును కూడ నెరుగని పాపాత్మునే పాపార్ణవము నుండి దాటింపగా పుణ్యమూర్తులను గురించి చెప్పనదేమున్నది ! అని పాపప్రభావము వర్ణింపబడినది.

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ॥
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 4-37

ఈ శ్లోకమున జ్ఞానమొక అగ్నితో పోల్చబడినది. ఇందు బహుజన్మార్జితములగు కర్మఫలములన్నియు సమిధలుగ పోల్చబడినవి. కర్మలు రెండు విధములు. పుణ్య కర్మలు, పాపకర్మలు. ప్రాయశ్చిత్తరూపమగు కర్మకాండ పాపఫలములను నశింపజేయును. పుణ్య ఫలములను నశింపజేయుటకు కర్మ కాండయందు పాయము లేదు. పుణ్య పాప రూపమగు కర్మఫలము

లన్నియు దగ్ధమైన గాని మోక్షము లేదు. అంతియే గాక పుణ్య పాపఫలరూపములగు కర్మలు మూడు విధములు. ఆగామి, సంచిత, ప్రారబ్ధములనునవి. ఆ మూడింటియందును ఆగామి సంచితములు రెండును జ్ఞానాగ్ని దగ్ధములగును. ప్రారబ్ధము మాత్రము జ్ఞానాగ్నిచే దగ్ధమగునది కాదు. అది అనుభవము చేతనే క్షయమగును.

వి - "సర్వ కర్మాణి" అనికి గదా? అందు ప్రారబ్ధము ఇమిడి లేదా ?

కృ - అక్కడ భ్రాంతి నొందుదువనే నేనా విషయమును విడదీసితిని. సంచితమనగా అనేక జన్మలలో చేసిన పుణ్య పాపకర్మల ఫలము అనుభవమునకు రాకుండ నిల్వ ఉన్నది. ఆగామియనగా వర్తమాన జన్మయందు జేయు పుణ్యపాపములు రాబోవు జన్మలకు ఫలరూపముగా మారునవి. ప్రారబ్ధమన ప్రస్తుతమగు జన్మకు వచ్చినప్పుడు అనుభవమునకై వచ్చినది. ప్రారబ్ధము ముక్తేషు న్యాయమున అనుభవముచేతనే నశించును. ముక్తేషు న్యాయమనగా విల్లుకు దొడిగిన బాణము వదలబడి మధ్యనెట్లు ఆగదో అట్లే ప్రారబ్ధము అనుభవమువనే సమాప్తమగునని అర్థము.

వి - సర్వకర్మాణి అన్న పదమునకు సార్థక్యమేమందురు ?

కృ - ప్రస్తుత జ్ఞాన సాధనకు పూర్వము చేయబడిన కర్మలతోపాటు జ్ఞానసాధనను సాధించు కాలమున గూడ చేయు కర్మలకు ఫలము ఉండును అందుచేత జ్ఞాన సాధనకాలమందలి కర్మలు కూడ జ్ఞానోదయమగుటతోడనే దగ్ధమగునని సర్వశబ్దమునకు అర్థము. దీనినే శంకరులిట్లు విశదీకరించినారు. జ్ఞానోత్పత్తేః ప్రాక్కృతాని జ్ఞానసహభావీని చ" అని.

"సామర్థ్యాద్యేన కర్మణా శరీర మారబ్ధం తత్ప్రవృత్త ఫలత్వాదుప
భోగే నైవ క్షీయతే అతః యాన్య ప్రవృత్తఫలాని జ్ఞానో
త్పత్తేః ప్రాక్కృతాని జ్ఞానసహభావీని చ అతీత అనేక జన్మ
కృతాని చ తాన్యేవ సర్వాణి భస్మసాత్కురుతే ॥ శం. భా.

వి - బాగున్నది. సమిద్ధోగ్నిః అనగా జ్వలించుచున్న అగ్ని అని గదా, అర్థము ?

కృ - అవును.

వి - అందేమైన విశేషమున్నదా ?

కృ - లేకేమి ? మంటలేని నిప్పు (అనగా పట్టి కట్టెలు)లో వేసిన కట్టెలు కాలనేకాలవు. ఇద్ధాగ్ని(మండుచున్న అగ్నియందు)లో వేసినకట్టెలు కాలును. మరల కాల్చుట కుపకరింపవచ్చును. సమిద్ధాగ్ని (భగ్గు భగ్గున మండుచున్న నిప్పు) లో పడిన కట్టెలు కాలి బూడిదగును. ఆ బూడిద కాలలేదు కాల్చలేదు. అట్లే జ్ఞానాగ్ని. అది సర్వ కర్మ లను భస్మముగా చేయును. అనగా సర్వకర్మ ఫలములను నశింప జేయును మరల బాధింపకుండునట్లు జేయును. అట్లే సర్వ కర్మాణి అనుటచే పుణ్యకర్మలును పాపకర్మలు ననియుఅర్థము.పుణ్యకర్మలనగా బంగారు సంకెళ్ళు. పాపకర్మలనగా ఇనుప సంకెళ్ళు. ఈ రెండును బంధింపుటయందు ఫలవిషయమున సమానములేయగుచున్నవి. కావున అపరోక్షజ్ఞానికి పుణ్య పాప ములు రెండును పూర్తిగా నశింపును. దగ్ధపటము (కాలిన గుడ్డ) కట్టుకొనుటకుగాని దేనికిగాని పనికిరానట్లే అపరోక్షజ్ఞాని ప్రారబ్ధ మును అప్రతిబంధకమైపోవును. ప్రారబ్ధము వానికి ప్రతిబంధకము కాదు. ఈ విషయమే వ్యాసభగవానులు సూత్రీకరించిరి. శంకరులు-

తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్.
అ. 4. పా. 1. సూ. 13

అథేదానీం బ్రహ్మవిద్యాఫలం ప్రతిచింతా ప్రతాయతేః

అని ప్రారంభించి బ్రహ్మవిద్యా ఫలమును గురించిన చర్చకు సంబంధించిన సూత్రమిది యని బ్రహ్మసాక్షాత్కారము కాగా ఆ సాక్షాత్కారమునకు విరుద్ధఫలము నొసగు పాపములు క్షయించునా క్షయించవా? అని సంశయము రాగా ఈ సూత్రము బ్రహ్మసాక్షాత్కారము నొందిన మహనీయులకు ఆగామి సంచితములగు పాప ప్రతిబంధకములు నశించునని చెప్పినదనిరి. కారణమేమనగా బ్రహ్మజ్ఞానమునకు పూర్వము కర్తృత్వభోక్తృత్వము లున్నవి. ఆకర్తృత్వభోక్తృత్వములకు విరోధమైనదియు మూడు కాలముల యందును కర్తగాని, భోక్తగాని కానట్టి బ్రహ్మరూపము నేనైతినని జ్ఞాని నిర్ణయము. ఆ నిర్ణయమున ఇంతకు పూర్వముకూడ నేను కర్తనుకాను, భోక్తనుకాను, ఇప్పుడు కాను, ముందును కాను అని నిశ్చయ జ్ఞానము కలుగుటచేత అజని కర్మ సంచయమంతయు నశించినదని సూత్రములోని వినాశపదము చెప్పుచున్నదనిరి. ఇట్టి జ్ఞానమే మోక్షమని శంకరుల నిర్ణయము.

"పూర్వప్రసిద్ధకర్తృత్వ భోక్తృత్వ స్వరూపవిపరీతం హి త్రిష్వపి కాలేష్వకర్తృత్వాభోక్తృత్వస్వరూపం బ్రహ్మాహమస్మి నేతః పూర్వమపి కర్తాభోక్తావాహమాసం. నేదానీం నాపి భవిష్యతి కాలి ఇతి.శం భా.

కర్మఫలములు నిర్బీజములుగా దగ్ధముకాగా జ్ఞాని భస్మచ్ఛన్నమైన అగ్నికణముభలె వెలుగొందుచుండునని యు దీని భావము. విపురు

గప్పిన నిప్పు అనుహూ క్తికిదియే అర్థము. కాని యిక్కడ జ్ఞాను లిద్దరు. పరోక్షజ్ఞాని అపరోక్షజ్ఞాని అనగా వేదాంత శాస్త్రమును చక్కగా తర్కప్రౌఢితో అన్వయించి పరులకు శాస్త్రవిధులను బోధించదగిన విద్వాంసుడు. అపరోక్షజ్ఞాని అనగా ఆత్మానుభవము కలిగి పరమ శాంతిని బొందిన అనుభవజ్ఞుడు. సమస్త కర్మలను నిర్బీజముగా దగ్ధము చేయదగినది అనుభవజ్ఞాని ఆత్మజ్ఞానమేగాని పరోక్షజ్ఞానము కాదు. అనుభవజ్ఞానము మాత్రమే కర్మబీజములను మొలకెత్తనివ్వదు.

"సమ్యగ్దర్శనం సర్వకర్మణాం నిర్బీజత్వేకారణం"
సమ్యగ్దర్శన మన అనుభవజ్ఞానము.

జ్ఞానమును అగ్నితో పోల్చుటలో మరొక్క సౌందర్యముకూడ ఉండవచ్చును. అగ్ని ఎప్పుడును ఊర్ధ్వముఖముగా జ్వలించును. ఎన్నటికీని అధోముఖముకాదు. జ్ఞానియు ఆత్మానుభవము నొందిన తర్వాత తిరిగి ప్రపంచాభిముఖుడు కాడని భావము. ఆ ప్రభావము జ్ఞానమున కొక్కదానికే గాని వేరొక యోగమున కాశక్తి లేదని కూడా దానిభావమే.

ఈ జ్ఞానమును నావగాను అగ్నిగను పోల్చినట్లే ఖడ్గమునకు కూడ పోల్చబడినది.

"తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః ఛిత్త్వైనం సంశయం"

అజ్ఞానమనునది ఒక గ్రంథి. అహం మమతలుత్పన్నమైనవి అజ్ఞానమునుండియే. అజ్ఞానమునకు స్థానము హృదయము. ఆ అజ్ఞాన గ్రంథిని అనగా ఆ బంధమును (ముడిని) ఛేదించుమనది.

జ్ఞానఖడ్గము. ఖడ్గమును చేతబట్టిన రాజు బాహ్య శత్రువుల జయించి సామ్రాజ్యము సంపాదించ, జ్ఞానఖడ్గము అంత శ్శత్రువుల జయించి ఆత్మసామ్రాజ్యమును సంపాదించును.

వి - శస్త్రచికిత్స ఆనాటికే యున్నది రాబోలు.

కృ - భారతీయ విజ్ఞానశాస్త్రము ననుసరించియే సర్వ విజ్ఞానమును ప్రవహించినది. ఏదియు నూతనముకాదు.

అశోకవనమునందున్న సీత యిట్లనెను.

'నూనం మమాంగా న్యచిరా దనార్య శ్శస్త్రై శ్శితై శ్ఛేత్స్యతి రాక్ష సేంద్రః, తస్మి న్ననాగచ్ఛతి లోకనాథే గర్భస్థజంతో రివ

శల్యకృంతః సు.కా.స.28.శ్లో.6.

రామచంద్రుడే వచ్చి తనను రక్షించని పక్షమున రావణుడు తనను ముక్కలు ముక్కలుగా నరుకునట. ఎట్లనగా? మాతృగర్భము నందున్న శిశువుబయలుపడని పక్షమున శస్త్రచికిత్సకుడు శిశువును ముక్కలకింద నరుకునట్లు తనను ఖండించునని శోకించినది. వాల్మీకి నాటికి శస్త్ర చికిత్స లేవందువా? అంతేకాదు. యజ్ఞ పశువును గురించి వర్ణించిన శ్రుతిసముదాయము శస్త్రచికిత్సను చెప్పలేదా ? అనంత వేదరాశియందు లేని విజ్ఞానమే నేడులేదు. ప్రకృతమున కొత్తము. ఈ జ్ఞానమును గీతాచార్యులు రాజ విద్యయని కూడ వర్ణించిరి.

"రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమం
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయం" 9-2

రాజ విద్యయేకాదు. రాజగుహ్యము, పవిత్రము, ఉత్తమము, ప్రత్యక్షావగమము, ధర్మ్యము, సుసుఖము, అవ్యయము అను పేర్లతో బహుముఖముగ వర్ణింపబడినది.

వి - ఇవన్నియు సార్థకనామములేనా?

కృ - సందేహమా?

(విద్యానాం రాజా) అన్ని విద్యలకును యీ జ్ఞానము రాజు కనుక యిది రాజవిద్యయైనది.

వి - విద్యలెన్ని ?

కృ - మన భారతీయ ఉపనిషత్సంస్కృతి భిన్నభిన్నములైన జ్ఞానశాస్త్రములవన్నిటిని ఒకభాగమును, అభిన్నము, అఖండమునైన వేదాంతమునంతను ఒక భాగముగను వర్ణించినది.

అఖండ విద్యకు పరావిద్యయనియు, ఖండములైయున్న శాస్త్ర సమూహమునకు అపరావిద్యయనియు, పేర్లు.

పరావిద్య నభ్యసించిన విద్వాంసునకు అపరావిద్యలన్నియును కరతలామలకములు. అపరావిద్యలన్నియు ఏకైక విజ్ఞానమునే బోధించునని చెప్పునది పరావిద్య. తరువాత విద్యయను శబ్దమునకు అర్థములేదు. ఆత్మను చూచు వారెవ్వరు? ఆత్మయే అంతను చూచును. పరావిద్య తెలియబడునదికాదు. తెలివియే పరావిద్య. ఈ విషయము నొక ఉపనిషద్వాణి ఉపన్యసించినది.

శౌనకుడను ఒక మహర్షి అంగిరసులను మహనీయుని వద్దకు వెళ్ళి సవినయముగ నమస్కరించి యిట్లు ప్రశ్నించెనట.

"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" ముం.ఉ.

హేభగవన్ ! దేనిని తెలిసుకున్న యీ పరిదృశ్యమానమగు విజ్ఞాన మంతయు తెలియును ?

అంగిరసుని సమాధానము.

"తస్మై సహోవాచ ద్వే విద్యే వేదితవ్యే, ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ"

నాయనా ! బ్రహ్మవిదులు రెండు విద్యలను వర్ణించిరి. పరా, అపరా అనునది.

"తత్ర అపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽ
అథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో
జ్యోతిష మితి.
అథ పరా యయా తదక్షరమధిగమ్యతే."

ఋగ్వేద యజుర్వేద సామవేదములు, అథర్వవేదము, ఆ వేదములకు అంగములైన వేదరహస్యములను ప్రతిపాదించు శాస్త్రములును, అపరావిద్యలను పేర పిలువబడుచున్నవి.

ఏకమై స్వచ్ఛమై, శివంసుందరం అని పిలువబడుచు, అక్షరమగు దానిని చెప్పునది పరావిద్యయై వెలసినది.

వి - అపరావిద్యల ప్రయోజనములను సెలవిత్తురా ?

శ్రీ - వేదములను ఉచ్చరించు విధానమును చెప్పునది శిక్ష. యజ్ఞములను చేయుపద్ధతిని చెప్పునది కల్పము. వైదిక లౌకికములైన శబ్దము యొక్క ప్రయోగములను తెలుపుచు శబ్దవ్యుత్పత్తుల నెరిగించుచు శబ్దార్థములను బోధించునది వ్యాకరణము. వైదిక శబ్దములకు

మాత్రమే కోశమై వైదీక వాఙ్మయమును నిర్ణయించునదీ నిరుక్తము. వైదీక ఛందస్సులను తెలుపునదీ ఛందస్సు. గ్రహాగతులను నక్షత్రగతులను వాటి స్థానస్వరూపములగు వాటికిని మనకునుగల సంబంధమును వేదమునందు చెప్పబడిన కర్మలాచరించుటకు తగిన కాలమును నిర్వచించునది జ్యోతిషము. అవి అపరావిద్యలు.

విజయా! ఆత్మతత్వమును ప్రతిపాదించిన ఉపనిషద్వాహిని కంతకును పరావిద్యయనియే పేరు. ఈ పరావిద్యను అభ్యసించినప్పుడే మానవుని విజ్ఞానము పరిపూర్ణమై వెలసినట్లగును. పరావిద్యయందు గాని హృదయము సంశయరహితముకాదు. అపరావిద్యల నెంత కాలము పరిశీలించియు మానవుడు తాను సంపాదింపతగిన విజ్ఞానమునంతను సంపాదింపలేదనియే అసంతృప్తి నొందును. పూర్ణరూపమగు తృప్తిని, అఖండమగు ఆనందమును అపరావిద్య లివ్వజాలవు. పరావిద్యయందు మాత్రమే కర్తవ్యము ముగియును. జీవధర్మమగు సంశయమను ముడితెగిపోవును. సముద్రములోనివే తరంగములైనట్లు పరావిద్యలోని తరంగములే విభక్తములై అపరావిద్యలను నామమును ధరించినవి. అట్టి పరావిద్యనే గీత రాజవిద్యయన్నది.

"దీవ్యతే హి ఇయం అతిశయేన బ్రహ్మవిద్యా సర్వ విద్యానాం"

ఇదియే పరమరహస్యము. కావున రాజగుహ్యము. మూడవది పవిత్రము అనుపదము.

జీవుల జీవత్వ దోషమును నిర్మూలించి వారిని పరిశుద్ధుల గావించు పవిత్రజ్ఞానమే శాస్త్రమునందున్నదీ? అదీ ఒక్క వేదాంత శాస్త్రములోనిదే. స్త్రీల కంఠమునందెన్ని హారములున్నను

మంగళ సూత్రములేక ఆ హారములకు శోభలేదు. ఎన్నిశాస్త్రముల నభ్యసించినను వేదాంతము లేక శోభలేదు. పవిత్రతయునులేదు.

వి - ప్రాయశ్చిత్త కర్మలున్నవి గదా ? అవి పవిత్రతను చేకూర్చవా ?

కృ - అవి పాపములను పోగొట్టును. అందును యే పాపమునకు సంబంధించిన ప్రాయశ్చిత్తకర్మలాపాపమును మాత్రమే తొలగించునుగాని ఒండు పాపమును తొలగింపనేరవు. అంతియేకాదు. ప్రాయశ్చిత్త కాండ పాపములను నాశముచేసినను పుణ్యములను నాశముచేయదు. అందును పుణ్యపాపముల రెంటిని ఒక్కమారుగా ఒక్కక్షణకాలమున నశింపజేసి సూర్యకాంతి చీకటుల పోగొట్టుటయు వెలుగు నిచ్చుటయు ఒక్కమారైనట్లు దోషమును పోగొట్టుటయు పవిత్రత నిచ్చుటయు ఒక్కమారుగ చేయునది వేదాంత తత్వమే. కావుననే భాష్యకారులు-

"సర్వేషాం పావనానాం శుద్ధికారణ మిదం బ్రహ్మజ్ఞానం
ఉత్కృష్టతమం అనేక జన్మ సహస్ర సంచితమపి ధర్మా
ధర్మాదీ సమూలం కర్మ క్షణమాత్రాద్భస్మీకరోతి
యతః అతః కిం తస్యపావనత్వం వక్తవ్యం ?"

అని వర్ణించిరి.

బ్రహ్మపదార్థమును వర్ణించుట కెట్లు వాణి లేదో జ్ఞానముయొక్క పవిత్రతను వర్ణించుటకుకూడ వాఙ్మయములేదని శంకరుల భావము. నాల్గవపదము ప్రత్యక్షావగమము అనుపదము. అనగా ఇంద్రియముల చేత అనుభవించు విషయ సుఖములెట్లు ప్రతివాని అనుభవము నందున్నవో అట్లే ఆత్మ ప్రతివాని అనుభవమునందును ఉన్న

దగుటచేత ఆత్మజ్ఞానము ప్రత్యక్షమేగాని అనుభవమున లేనిదిగాదు. తరువాతది, "ధర్మ్యం" అనుమాట. ఈ విద్య వేదశాస్త్ర ప్రమాణము కలది బౌద్ధమువలె వేదప్రమాణ రహితమైనదికాదు. "అవ్యయం" శాశ్వతము, మరపురానిది, తరువాత "కర్తుం సుసుఖం" సాధకున కెంతయో సులభముగా నాచరింప దగినది.

వి - ఒక్కమనవి. ఇదేమి బ్రహ్మవిద్యయా? అను నానుడి లోకము నందున్నది. నిజమున కీ విద్య సులభసాధ్యమగుచో అందరును ఎందుకు గ్రహించరు? కాక శ్రీకృష్ణులే వేయింటికొక్కరుగాని తనను తెలిసుకొనలేరని నిర్ణయించిరిగదా? జ్ఞానము సుసుఖ మెట్లగును?

కృ - నీవన్నమాటలు యథార్థములు. కాని సుఖ సాధ్యమనునదియు యథార్థమే. కష్టసాధ్యమనుమాటయు యథార్థమే. ప్రపంచము వైపుననే చూచువారికిది కష్ట సాధ్యము, జిజ్ఞాసువులై శ్రద్ధావంతు లగు వారికిది సుఖ సాధ్యము. హనుమంతునకు సముద్రము గోష్పదమైనది. ఈ జ్ఞానమును గురించిన శ్లోకములింకను కలవు.

"శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥" 4-33

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం॥ 5-16

యజ్ఞము లెన్నియోయున్నవి. ద్రవ్యప్రధానములైనవి ద్రవ్య యజ్ఞములు. ఆత్మప్రధానమైనది జ్ఞానయజ్ఞము. జ్ఞానయజ్ఞమునందు కర్మలన్నియు సమాప్తములు. కర్తవ్యములు లేక కర్త నిస్తరంగ సముద్రుడై విలసిల్లుట యీ జ్ఞానయజ్ఞమునందే కుదురును. కాక

ఆత్మస్వరూపమును కప్పివైచిన అజ్ఞానాంధకారమును తొలగించి స్వస్వరూప సందర్శనము నందించువాడు జ్ఞాన భాస్కరు డొక్కడే నని శ్రీకృష్ణుడు ఘంటాపథముగ పలుకుచుండిరి. ఇందతి శయోక్తి లేదు. చిమ్మచీకటిని పోగొట్టి స్వచ్ఛమైన వెలుగును ప్రపంచమున కంతకు నందించవలసి వచ్చినప్పుడు విద్యుద్దీపము లెన్నియైనను సార్వకాలీనములై వెలుగు నివ్వగలవా? అట్టి వెలుగు నిచ్చువాడు సూర్యుడొక్కడే.

నీవు మాత్రము శ్రీకృష్ణుడు వేయింటనొక్కరే అర్హు లన్నమాట స్మృతియం దుంచుకొని జ్ఞానము మనకెక్కడ సాధ్యమని భావించి, అది యెంతపుణ్యాత్ములకో నని మాత్రము నిరుత్సాహపడకు. ఆ పుణ్యాత్ములుకూడ నీవంటివారే. మానవుడు సాధించరానిది కాదీ జ్ఞానము. మానవుడే సాధించగలిగినదికూడ.

నేటి భౌతికవాదులు భూమండలమున రెండులక్షల ఏబదిమూడువేల మైళ్ళ దూరమునందున్న చంద్రమండలమును, యిరువది నాలుగు కోట్ల డెబ్బదిమైళ్ళ దూరమునందున్న కుజమండలమును ఇట్లే అత్యంతదూరవర్తులై యున్న బుధ గురు శుక్ర శని మండలము లను గూడ పరిశోధించ ప్రయత్నములు చేయుచు కృతకృత్యుల మైతిమని తృప్తులగుచుండ నీకు అత్యంత సన్నిహితమైన పర మాత్మను గురించిన జ్ఞానము కష్టసాధ్యమెట్లగును? ధైర్యమును వహించి సాధన భాగమున అడుగిడుము.

"జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్య శేషతః
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవ
శిష్యతే"॥ 7-2

దేవుని తెలుసుకొన్న తరువాత తెలియదగినదీ లేదో దానిని చెప్పుచుంటినని చెప్పెను శ్రీకృష్ణులు.

వి - కర్మయోగమునను భక్తి యోగమునను సాధకునకు కొన్ని అర్హతలను నిర్ణయించితిరి. అట్లే జ్ఞాన యోగము నందును సాధకున కందింపదగు అర్హతలేమైన కలవా ?

కృ - ప్రతి యోగమునకును అధికార నిర్ణయమున్నది.
అధికారమన అర్హత. అర్హతను గుర్తెరిగియే ప్రతిశాస్త్రమును సాధకున కందించుట భారతీయ సంప్రదాయము. నేడును అట్టి అధికార నిర్ణయమును చేసుకొనియే విశ్వవిద్యాలయములందు విద్యార్థులను గ్రహించుచున్నారు. ఒక పంటను వేయవలెనన్న భూమియొక్క యోగ్యతను నిర్ణయించుకొనవలెను. అట్లే జ్ఞాన యోగమునకూడ కర్తయొక్క అర్హత అవసరమే. వ్యాసులు 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యని సూత్రీకరించగా శంకరులు, అథ శబ్దమునకు అనంతరమని నర్థమును చెప్పి, జ్ఞాన సాధనకు వలసిన సాధన చతుష్టయమును నిర్ణయించిరి. ఆ సాధనసామగ్రి లేని వారికి ఆత్మతత్త్వ ప్రతిపాదనము పనికిరాదనిరి. వాటి వివరమును రేపు నిర్ణయించెదను. ఈనాటికి గోష్ఠి సమాప్తము.

వి - గురుచరణం భవహరణం.

# గీతాహృదయము

## -: ప్రయత్నము :-

తే॥ తఱిసిరే వేల్పులు దధిరత్నములచేత
వెరచిరే ఘోరకాకోలవిషముచేత
విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

గీతా సారస్వతము పాఠకులకు పురుష ప్రయత్నమును ప్రబోధించునా ? లేక అంతయు దైవాధీనమని కూర్చొను మౌనవ్రతమును బోధించునా ? అనునదే ప్రశ్న.

భారతీయ సారస్వతము మానవుని బలహీనుని గావించి ఆత్మబలమును అంతరింపజేయునది కాదు. ఆత్మోత్సాహమును మిన్ను ముట్టించునట్టి ధైర్యసాహసముల ప్రబోధించి మృత్యువును సైతము నెదుర్కొనగల సామర్థ్యము నొసంగు విజ్ఞానామృత భాండారము. భారతీయ సారస్వత మాతృగర్భమునుండియే మృత్యుదేవత నెదుర్కొనగల వీరపురుషులు భారతక్షేత్రమునందావిర్భవించి మృత్యుంజయులై భారతీయ సారస్వతమున కొక ప్రత్యేకతను ప్రకటించిరి. భారతీయులారా ! గీతావాణి మృత్యువే లేదను పరమ సిద్ధాంతమునే తన ముక్తకంఠమున గానము చేసినదే గాని వేరొక సిద్ధాంతమును విస్తరించి చెప్పలేదు. నన్ను మృత్యుముఖమున కందించెదనని పలుకువాడును నన్ను మృత్యువు గ్రహింపవచ్చుచున్నదని ఉలికిపడువాడును అజ్ఞానమను గాఢాంధకారమున మునిగినవారేనని ముక్తకంఠమున యెలుగెత్తి పాడినది.

"య ఏవం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ 2-19

మృత్యువనునది కలదన్న సిద్ధాంతమున యిద్దరు కావలసి రాగా రెండు పదార్థములే లేవు ఉన్నదొక్కటే. చంపువాడును చచ్చువాడును యిద్దరు లేరు. ఉండిరనుకొనుట అజ్ఞానము అనెను. అప్పుడు ఈ సిద్ధాంతము శాస్త్రమాత్రమా ? అనుభవయోగ్యమా ? అను శంకవొడమును. ఆ శంకకు సమాధానముగ శంకరవాణి కర్తయు భోక్తయుగాని ఆత్మవీరుడొకడుండెనని నిర్ణయించినది. అదుగో కృష్ణానంద విజయులు. పాఠకులంతభిముఖులై వేంచేయుచున్నారు. నిన్నటివారి గోష్ఠి జ్ఞానయోగ ప్రభావమును వర్ణించినది.

కృష్ణానంద విజయుల గీతాగోష్ఠికిది రెండవరోజు. విజయుని అభివాదన గీతమిది.

"బీజస్యాంత రివాంకురో జగ దిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్యచిత్రీకృతం
మాయావీవ విజృంభయ త్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే.

తరువాత వారిద్దరును శబ్దబ్రహ్మరూపమున వెలుగొందు గీతావాణిని కూడ ఈ క్రింది శ్లోకమున స్తుతించినారు.

"పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతం
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీం॥

గోష్ఠి ప్రారంభమైనది.

వి - స్వామీ ! నేడు జ్ఞానయోగసాధకుని కర్తవ్యములు.

కృ - అవును. ఇందు ముఖ్యకర్తవ్యము ప్రబల ప్రయత్నము. ప్రయత్నమునకు బలమును చేకూర్చునది శ్రద్ధయను గుణము.

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః" 4-39

వి - శ్రద్ధ అను దానికి నిర్వచనమేమియందురు ?

కృ - నిగమాచార్య వాక్యేషు భక్తిశ్శ్రద్ధేతి విశ్రుతా

గురుపర్యులు చేయు ప్రబోధమునందును, వేదాంతశాస్త్రము ప్రసంచించు వచనములందును, ఇవి యథార్థములేనన్న నిశ్చయబుద్ధికి శ్రద్ధయని పేరు.

"గురువేదాంత వాక్యేషు ఇదమిద్ధమేవేతి ప్రమాణ రూపాస్తిక్య బుద్ధిః శ్రద్ధా"

వి - ఆస్తిక్య బుద్ధియున్న చాలునందురా ?

కృ - చాలదు. తత్పరుడు కావలెను. అనగా గురువులు బోధించు బోధలు తనబుద్ధియందు ఒక్కమారుగ హత్తుకొనక పోవచ్చును. అప్పుడు గురుసన్నిధియందుండి నిరంతర సేవనమున వారి వాక్య తాత్పర్యమును నిరంతరము మననము చేయుటకు తత్పరత్వమని పేరు. దానితోపాటు ఇంద్రియ సంయమమును అవసరమే. గురువేదాంత వాక్యముల నెంత మననము గావించినను పరోక్షజ్ఞానమే కలుగును. గాని అపరోక్ష జ్ఞానము సిద్ధించదు. అపరోక్ష జ్ఞానమునకు ఇంద్రియముల సంయమము అవసరము కావుననే "సంయతేంద్రియః" అని పలికినారు.

వి - మన ప్రయత్నము సాధ్యము కావలెనన్న దైవమును అనుకూలించవలెను గదా ?

కృ - అక్కడనేయున్నది పొరపాటు. మోక్షము పురుష ప్రయత్నము చేతనే సిద్ధించునది గాని కేవల దైవప్రసాదమునకాదు. ఈ ఘట్టమున బాధ్యతయంతయును సాధకునిదే. మందును మ్రింగవలసిన వాడు రోగిగాని వైద్యుడు గాదు. ఔషధమును సేవించుటలో గల శ్రద్ధాసక్తులు రోగివి గాని వైద్యునివి కావు.

వి - పూర్వజన్మ ప్రతిబంధకములు నేటి ప్రయత్నమును కుంటుపరచును గదా ?

కృ - వాటిని ఎదుర్కొనవచ్చును. ఎదుర్కొనవలెను. ఎదుర్కొనక పోవుట సాధకుని అసామర్థ్యము లేక సోమరితనము. శాస్త్రమట్లు చెప్పుచున్నది.

"ప్రాక్తనం చైహికం చేతి ద్వివిధం విద్ధి పౌరుషం
ప్రాక్తనోఽద్యతనేనాశు పురుషార్థేన జీయతే"
"యత్నవద్భి ర్దృఢాభ్యాసైః ప్రజ్ఞోత్సాహసమన్వితైః
మేరవోఽపి నిగీర్యంతే కైవ ప్రాక్పౌరుషే కథా"॥

వాశిష్ఠము.

పురుషుని కర్మవాసనలు రెండు విధములు. ప్రాక్తనలు, అద్యతనములు. ప్రాక్తనములనగా పూర్వజన్మకృతములు. అద్యతనములనగా నేటివి. పూర్వజన్మ వాసనలు బలము కలవా ? నేటి ప్రయత్న వాసనలు బలము కలవా ? అను ప్రశ్నకు సమాధానము నేటి ప్రయత్న వాసనలకే బలము కలదనియు, నేటి ప్రబల ప్రయత్నములు ప్రాక్తన కర్మవాసనలను త్రోసిరాజన గలవనియు శాస్త్రము సిద్ధాంతీకరించినది.

సాధకుడు ప్రబల యత్నము కలవాడై దృఢాభ్యాసము కలవాడయ్యే నేని మేరుపర్వతమును కూడ కదలించి దానికి శైథిల్యమును కల్పించ వచ్చునని యు శాస్త్రము చెప్పుచున్నది. వసిష్ఠ మునీంద్రులు రామచంద్రున కుపదేశించిన యుపదేశమిది.

వి - అవును. శాస్త్రము చెప్పవచ్చును. అనుభవమునకు సరిపోవలెను గదా ?

కృ - అనుభవమునకు సరిపోవుదానినే శాస్త్రము చెప్పును. అనుభవము వేరు, శాస్త్రము వేరుకాదు. మానవుని కర్తవ్యములకు ముందున్నదే శాస్త్రము. మానవ సమాజము యొక్క అనుభవములు శాస్త్రములు కావు.

వి - శాస్త్రము అనుభవము అను నీ రెండింటియందును ప్రధాన స్థానము దేనికందురు?

కృ - ప్రధానస్థానము శాస్త్రమునకే! ఆచార్యోప దేశముకూడ శాస్త్ర సిద్ధము కావలెను.

"శాస్త్రాచార్యోపదేశ శమదమాది సంస్కృతం మనః
ఆత్మదర్శనే కరణం"॥ శం.భా.

వి - ఒక అభ్యాసకుడు శాస్త్రము ననుసరించి అభ్యాసమును చేసికూడ ఆసాధన భాగమాత్రమునకి ఫలించనప్పుడు అది యనుభవమునకు విరుద్ధమేగదా?

కృ - ఆదే సాధన భాగమును శాస్త్రవిధానముగ వేరొకడు చేసి సిద్ధి బొందితి నన్నచో నీవు చెప్పినవాని అనుభవము దోషయుక్తమైనది గదా?

వి - అవును.

కృ - కావున శాస్త్ర ప్రమాణము కూడ ఎవని అనుభవమున కలియునో వాని అనుభవమే ప్రమాణముగాని ప్రతివాని అనుభవమును ప్రమాణము కాదు. శాస్త్రమనునది లేక అనుభవమే ప్రమాణమను సిద్ధాంతమున ఒకడు మరియొకరికి ఆదర్శము కావలసిన పనిలేదు. ఎవరికివారే ఆదర్శ పురుషులగుదురు.

వి - కొందరు మనదేమియును లేదు. దైవము బుద్ధినిచ్చిననే పుణ్య పాపముల మనము చేయుదుమందురు. అంతయును దైవముమీద భారము వేయుదురు. అది శాస్త్ర సిద్ధాంతముకాదా ?

కృ - కాదు. దైవమే మనచేత పుణ్యపాపముల చేయించునో దైవము విధించిన శాస్త్రములు వ్యర్థములు కావలసి వచ్చును.

"ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ"॥ 3-34

రాగద్వేషములకు వశముకాకుండ శాస్త్రము ననుసరించుటలో జీవునకు స్వతంత్రమున్నదని గీత బోధించుచున్నది. అవతారమూర్తులైన రామకృష్ణులిద్దరును వేదశాస్త్ర బద్ధులైరిగాని మా అనుభవమిది యని స్వతంత్ర సంఘసంస్కర్తలు కాలేదు. కావున శాస్త్రమునే మన అనుభవముగ గ్రహించవలెను.

వి - చిత్తము. భారతీయ శాస్త్రములన్నియు ఏకైక సిద్ధాంతమును చెప్పుటలేదు. కొన్ని సిద్ధాంతములు పురుష ప్రయత్నమను నదే లేదనును. మరికొన్ని దైవములేదు. కర్మయే మానవుని నడుపునని చెప్పును. ఇట్లు అనేకములై యున్నవి.

శ్రీ - నీవు ఒక్కడవే మిగిలినప్పుడు శాస్త్రములన్నియు కలసి ఏకమగును. భిన్న భిన్నసంస్కారములు గలవారికి విభిన్న దృక్పథములను బోధించవలెనని బోధించినవి. అంతే. ఆత్మ జ్ఞానమును సాధించు సాధకుడు దైవమునకే తన మోక్ష సంపాదనను వదలుట సిద్ధాంతముకాదు. దైవమనగా ఇక్కడ ప్రాక్తన కర్మయే. అదియే నన్ను ప్రేరేపించునని కూర్చొనరాదు.

"అసద్దైవమథః కృత్వా నిత్యముద్రిక్తయా ధియా।
సంసారోత్తరణం భూత్యై యతేతాఽథాతుమాత్మని"
వాశిష్ఠము స. 5—13.
"న గంతవ్యమనుద్యోగైః సామ్యం పురుషగర్దభైః
ఉద్యోగస్తు యథాశాస్త్రం లోకద్వితయ సిద్ధయ"॥ స. 5—14

ప్రాక్తనమైన దురదృష్టమునంతయు ఈ జన్మమునందు చేయు పుణ్యముచేత తిరస్కరించి నీ ప్రబలయత్నము చేతనే యీ సంసారమును తరింపుము. ఆత్మోద్ధరణకై ప్రయత్నము చేయనివారు పురుష గర్దభులనబడుదురు. ఇహపర సౌఖ్యములకు రెంటికిని సశాస్త్రీయమగు ప్రయత్నము చేయుటయే పరమసిద్ధాంతము. ప్రయత్నమును గురించి ఒక చక్కని శ్లోకమున్నది.

ఉద్యోగః ఖలు కర్తవ్యః ఫలం మార్జాల వద్భవేత్
జన్మప్రభృతి గౌర్నాస్తి పయః పిబతి నిత్యశః॥

మానవుడేపనిని సాధించదలచునో ఆ పనిని సాధించు వరకు పిల్లి వలె ప్రయత్నించవలెను. అనగా పిల్లిని ఎన్ని పర్యాయములు త్రోలినను విసుగుజెందకయె మరల మరల ఆహార ప్రయత్నమును

చేయుచుండెను. అది పుట్టినది మొదలు అవును సంపాదించలేదు. కాని ప్రతి నిత్యమును దాని ప్రయత్నముచేత పాలను సంపాదించుకొనుచున్నది. భర్తృహరిని కూడ ఒక్కమారీ విషయమున స్మరించుట యుక్తము.

ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
ఆరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

భారతీయ సిద్ధాంతము మనస్సునకొక మహాశక్తియున్నదని నిర్ణయించినది. ఆ శక్తి మనః పరమాణువున నిగూఢమై యుండును. దానిని బహిర్గతము గావించునదే పురుష ప్రయత్నము. మనోమయ కోశమున అత్యంత నిగూఢమై మరుగుపడియున్న ఆ మహాశక్తిని స్మృతిపథమునకు తెచ్చి, దానిని విజృంభింపజేయు సాధన భాగముల నందించునదే శాస్త్రము. ఆ శాస్త్రములలోని నిగూఢ రహస్యముల నందించు వారే గురువర్యులు. భౌతికవాదులు చెప్పునదికూడ మనశ్శక్తిని గురించియే. కాని వారి ప్రబోధము జడ ప్రపంచము పైననే వ్యాపించినదిగాని, మనస్సున కవ్వల వెలుగొందు ఆత్మకు అభిముఖము కాలేదు. ఆత్మాభిముఖమైనప్పుడే ఆ మనశ్శక్తిని మానవుడు సార్థకము గావించుకొన్నట్లని తత్వశాస్త్రములు నిర్ణయించుచున్నవి.

విజయా! భౌతికవాదులెన్ని సిద్ధాంతములను కనుగొన్నను, ముందు కనుగొనబోవుచున్నను వైదిక వాఙ్మయ సీమను అధిగమించజాలరు. ఉపనిషత్పారస్పతమువ మనస్సే బ్రహ్మము. బ్రహ్మమే మనో

రూపమై యున్నది. చివరకు సృష్టి, స్థితి, లయములను గావించునది మనస్సేనని ఉపనిషద్విజ్ఞానము నిర్ణయించినది. మనస్సను నది యొక నూతన పదార్థముకాదు. తరంగములు జలముకంటె భిన్నములుకావు. మనస్సు కూడ బ్రహ్మముకంటె వేరుకాదు. తరంగములను జలమయములుగా గ్రహించుట వంటిదే మనోమయ ప్రపంచములను లయము చేయుటయని తత్వశాస్త్రముల సారము. కాని ఆ మనస్సు అజ్ఞానభూమికలతో కూడినప్పుడు జడ ప్రపంచము నందే నిన్ను త్రిప్పును. జ్ఞాన భూమికలలో చరించుచున్నప్పుడు నిన్ను మృత్యుంజయునిగా చేయును. ఆ చిత్తమునకు దేని సహవాసము చేసిన దానితోవను బోవు స్వభావము మాత్రమొకటున్నది ఆ మనస్సునకు చక్కని రాచబాటను చూపుటే ముముక్షువుయొక్క ప్రయత్నము.

వి - అటులైన ప్రస్తుత నా కర్తవ్యమేమియందురు?

కృ - అజ్ఞాన స్వరూపమును గుర్తెరుగుట ప్రథమ కర్తవ్యము.

వి - అజ్ఞాన భూమికలను మాట నొకటి వాడితిరి గదా! పైన

కృ - వాని వివరణము నేజెప్పెదను.

వి - చిత్తము.

కృ - భూమికలన మెట్లు. అజ్ఞాన భూమికలన అజ్ఞానముయొక్క సోపానములు. అవి ముఖ్యముగ ఏడు. 1) బీజజాగ్రత 2) జాగ్రత, 3) మహాజాగ్రత, 4) జాగ్రత్స్వప్నము, 5) స్వప్నము, 6) స్వప్నజాగ్రత, 7) సుషుప్తి. నిత్యమును మనచిత్తమీ సోపానములనే ఆరోహణావరోహణల గావించుచుండును. ఈ యేడు

భూమికలును జాగ్రత్స్వప్నసుషుప్తులగు మూడు అవస్థలలో నిమిడి యున్నవి. జాగ్రత్స్వప్నసుషుప్తులకే, సృష్టిస్థితిలయములని కూడా పేరు. సుషుప్తియన గాఢనిద్ర. ఆ నిద్రయందు బాహ్యమగు జగత్తుగాని మనోమయములైన సంకల్పములుగాని యుండవు. అన్నియు సంస్కారములుగా నా సుషుప్తియందే అణగియుండి, తిరిగి జాగ్రత్తకు వచ్చునప్పుడు ఉద్బుద్ధములగును. అట్లు సుషుప్తి నుండి జాగ్రత్తకు వచ్చునప్పుడు ప్రప్రథమముగా కలుగు తన పరిణామమునకు బీజ జాగ్రత అని పేరు. మిగిలిన అన్ని సంస్కారములకును నిది బీజము కనుక బీజ శబ్దమును, జ్ఞాన రూపమగు నది కనుక జాగ్రత్ శబ్దమును కలిగియున్నది. ఆ రెండును కలిగినది బీజ జాగ్రత. పర్యవసానము సుషుప్త్యవస్థ నుండి జాగ్రదవస్థకు వచ్చుటకుముందు కలుగుజ్ఞానముయొక్క ప్రథమావస్థ బీజ జాగ్రత.

రెండవది జాగ్రత. జాగ్రత అనగా జనించినది అని అర్థము. సుషుప్తినుండి మేల్కొని, నేను రాముడను, లేదా కృష్ణుడను అను జ్ఞానముగాని, ఇవి నా వస్తువులు, వీరు నా దారాపుత్రాదులు అను జ్ఞానముగాని సుషుప్తియం దెరుగని అహంకార మమకార జ్ఞానము లన్నియు బీజజాగ్రత తరువాత కలుగుచున్నవి. ఈ జ్ఞానముల కన్నిటికిని మూలము బీజ జాగ్రత. ఆ బీజజాగ్రతనుండి వచ్చినది జాగ్రత. దీనికి తరువాతది మహాజాగ్రత. దీనికీ పేరేల వచ్చినది? జన్మాంతరములందలి సంస్కారము లన్నియు దృఢములై సర్వవ్యవహారములకును సాధనములై ప్రవర్తించుటకీ భూమికయే స్థానము. అందువలన నీ భూమికకు మహాజాగ్రతయని పేరు. ఈ భూమిక సర్వజీవులకును ప్రసిద్ధమగునదే. దీనినే మనము

జాగ్రదవస్థయని వాడుదుము. ఇది త్రికాల సత్యమై విలసిల్లుచున్నట్లగ పడును. ఇంతవరకు మూడు భూమికలను గురించి వివరణము జరిగినది. నాల్గవ భూమికకు జాగ్రత్స్వప్నమనిగదా పేరు? అనగా మనము మెలకువ కలిగియున్న జాగ్రదవస్థయందే స్వప్నము వంటి అవస్థావిశేషమొకటి యున్నది. ఒకేఒక పదార్థమును ఏకాగ్రచిత్తమున ధ్యానము గావించునప్పుడు బాహ్యమగు జగత్తును మరచి నిద్రపోవువానివలెనే యుండుట. అప్పుడు తనమనస్సు దేనిని ధ్యానించుచున్నదో అదిసత్యమై కన్పట్టును. ఆపదార్థ మొకప్పుడు చూచినదీ కావచ్చును. చూడనిదియు కావచ్చును. అప్పుడు గలుగు అనుభవము భ్రాంతికూడ కావచ్చును. ఒక వస్తువును చూచి మరియొక వస్తువని తలచుటకు భ్రాంతియని పేరు. ఆ భ్రాంతియే సత్యమని భావించుచు ఆ యనుభవమునే గలిగి ఇంతకు పూర్వమగు విషయమును మరచుట జరుగును. సామాన్యముగ నీ విషయము నిద్రయందు జరుగుట నందరు నెరుగుదురు. జాగ్రదవస్థయందే యీ తన్మయత కలుగుట అనుభవమున లేని విషయముకాదు. మెలకువలో నున్నప్పుడే త్రాడును చూచి సర్పమని భ్రాంతినొంది, అది సత్యమని నమ్మి భయ కంపాదుల నొందుదురు. లేక ఒకానొక సుందరిని మోహించినవాడు ఆ సుందరినే ధ్యానించుచు బాహ్యజగత్తును మరచి ఆ సుందరితో మాట్లాడుటను ఆ సుందరిని కౌగలించుటను భావించుచుండును. అప్పుడాతడున్నది జాగ్రదవస్థయే. కాని జాగ్రదవస్థయందా సుందరి మాత్రములేదు. అందు కని ఆ సుందరి లేనిదై అతనికి తోచదు. ఆ సుందరి యొక్క

యునిసనే అత డనుభవించుచుండును. లేనిదానిని ఉన్నటుల భావించి మరియొక కాలమున దానిని లేనిదని తెలుసుకొన్నచో భావించినది స్వప్నమగును. అట్టి విషయమే జాగ్రతయందు కలిగిన యెడల దీనికి జాగ్రత్స్వప్నమని పేరు. సంగ్రహముగా చెప్పవలెనన్న మెలకువలో నిద్ర.

వి - జాగ్రదవస్థయందే యున్నను మనోమయ ప్రపంచముననే లీనమై సంకల్ప రూపములగు విషయ సుఖముల ననుభవించుటయే జాగ్రత్స్వప్నమన్నమాట.

కృ - అవును.

వి - ఒక్క సందేహము. నేను విజయుడనుగాను, నేనానందుడను వాడను అని మనస్సునందు నిరంతరధ్యానము కలిగి దృఢాభ్యాస మగుచో నా మనస్సు నన్ను జాగ్రదవస్థలో కూడ ఆనందునిగానే చూపునందురా?

కృ - సందేహము లేకుండ చూపును. కాని ఆనందుడను నేను అన్న వాసనకు పూర్వమున్న విజయుడ నను వాసన సంపూర్ణముగ నశించె నని నీ వానందుడవుగానే నిర్ణయము కలుగును. అంతయు మనోమయమే. దీనికొక చక్కని కథ ఉన్నది. జరిగిన కథయే! ఒక మహారాజు నాలుగు గడియల కాలములో జాగ్రదవస్థయందే చండాలుడై కొన్ని సంవత్సరము లా చండాల జాతియందే యుండి సంసారమును చేసి బిడ్డలను కూడ కన్నకథ.

లవణుడని ఒక సూర్యవంశపురాజు. అతడు ధర్మమూర్తి. అతని సామ్రాజ్యము ధర్మదేవతకు రాజధాని. ఆ ప్రభువొకనాడు నిండు పేరోలగమున సింహాసనాసీనుడై యుండ నొక యింద్రజాలికుడా

సభకు వచ్చెను. రాజు మహాదాత. శిల్పవిద్యల ప్రోత్సహించుటలో ఉదార హృదయుడు. ఇంద్రజాలకుడు మహారాజునకు నమస్కరించి ప్రభూ! నేనొక ఇంద్రజాలమును గావించెదను. అది అత్యంత చమత్కారమగు విద్య. తమరీ సింహాసనమునందే యుండి ఆశ్చర్యమును జూడవచ్చుననెను.

మహారాజు అందుకు అనుమతించెను. ఆ యింద్రజాలకుడేమియు మాటాడలేదు. పెద్ద కలాపమును గూడ ఏమియు చేయలేదు. ఆ యింద్రజాలకునిచేత నొక నెమలి యీకల కుంచె యున్నది. ఆ కుంచె నాతడు అటు నిటు త్రిప్పెను. అంతియె. ఆ త్రిప్పుటను రాజు ప్రత్యక్షముగనే చూచు చుండెను. అంతలోననే ఆ చక్రవర్తి కడకొక సామంతరాజు వచ్చెను. ఆ రాజు వెంటనొక గుఱ్ఱము ఉచ్చైఃశ్రవకులములోనిది కావచ్చును. ఆ సామంత రాజా యశ్వమును లవణునకు చూపి, మహారాజా ఈ గుఱ్ఱము ఉచ్చైశ్రవముతో సమానమైనది. దీనిని నా అధిపతియగు సింధుదేశపురాజు చక్రవర్తియగు మీకు పంపెను. విశిష్టములగు వస్తువులు మహదాశ్రయములై భాసించును గదా! యని సామంతరాజు పలుకుచుండగనే ఆ యింద్రజాలకుడు మహారాజా! ఈ గుఱ్ఱము మిక్కిలి శ్రేష్ఠమైనది. దీని నధిరోహించి యొక్కమారీ ప్రపంచ విహారమును సలుపుడని ప్రేరేపించెను. లవణ మహారాజుయొక్క చూపులా గుఱ్ఱము పైన నిలచినవి. రాజునకు చేష్టలుడిగినవి. అకడొక శిలావిగ్రహము వలె నుండెను. తెరపై వ్రాసిన బొమ్మయయ్యెను. ధ్యానము చేయుచున్న యోగివలె నుండెను. ఒక నాలుగు ఘడియల కాలము ఏ విషయమును తన మనస్సునందు ప్రవేశపెట్టినవాడు కాడా మహారాజు.

ఆ నాలుగు ఘడియల కాలమును, ఆ సభాసదులును, మంత్రులును రాజునకు కలిగిన ఆయవస్థావిశేషమునకు సంశయాశ్చర్యములు పెనగొన విచారింపసాగిరి. సభయంతయు నిశ్శబ్దమైయున్నది. కాని కొద్ది కాలమునకే సభాసదులు భయకంపితులై దుఃఖించుచుండిరి. అట్లే నాలుగు ఘడియల కాలము గడచినది. రాజు మేల్కాంచెను. కాని ఆ సింహాసనముననే గూర్చుండి గడగడ వణకసాగెను. అతని ప్రక్కనున్నవారు పట్టుకొని అలసటదీర్చిరి. రాజు బాగుగ మెలకువ నొందెను. గడచిన నాలుగు ఘడియల కాలములోని భ్రాంతికిని మంత్రిసత్తములు కారణ మరయగోరిరి. రాజుచెప్పిన ఆత్మకథ యిది.

ఇంద్రజాలికుడు త్రిప్పిన నెమలి పింఛమును జూడగానే నా చిత్తము భ్రమించినది. నాయెదుటనున్న గుఱ్ఱము నెక్కితిని. ఆ అశ్వము మహావేగముతో నన్ను బహుదూరము గొనిపోయెను. అక్కడ కొన్నిమృగముల వేటాడుచు నేనొక్కడనే ఒక మహారణ్యమున ప్రవేశించితిని. అది ఒక యెడారి. అందొక వృక్షముగాని పక్షిగాని కూడ చరించుటలేదు. సూర్యాస్తమయమైనది. ఆ ప్రదేశమును దాటిననేగాని నేనును, గుఱ్ఱమునుకూడ బ్రతుకజాలము. అందు త్రాగుటకు మంచినీరైనను లేదు. ఎట్టకేలకా యశ్వముపైననే సవారిచేయుచు మరియొక ప్రదేశమును చేరుకొంటిని. అందు కొన్ని వృక్షములున్నవి. అందొక వృక్షచ్ఛాయను చేరగా ఆ చెట్టుకొమ్మనొకదానిని ఆధారముగాగొని అశ్వము నుండి దిగితిని. అశ్వము మటు మాయమైనది. నేనా చెట్టు క్రిందనే విశ్రమించితిని. ఆ రాత్రి అచ్చటనే గడచినది. అంత పద్మబాంధవు

దుదయించుచున్నాడు. ఆ యరణ్యమంతయు కలయదిరిగితిని. అక్కడ నా కాప్తబంధువులెవరు? ఒక్క చండాల కన్యక కాన వచ్చినది. దాని శిరముపై నున్న అన్నము చూచితిని ఓ చిన్న దానా! నేను మిక్కిలి దస్సియున్నాను. నిన్నటిదినమంతయు భోజనము లేదు. నీవు గొనిపోవుచున్న అన్నమును నాకు పెట్టుమని యడిగితిని. దురదృష్టవంతునకు లక్ష్మీకటాక్షము కలుగనట్లు ఆ కన్యక నాకొక్క మెతుకైనను పెట్టలేదు నేనుమాత్ర మాకన్యను వెంబడించుచునే యుంటిని. చివరకా చండాలయువతి తన్ను పెండ్లి యాడిన నాకన్నము పెట్టెదనన్నది. నా ఆకలిబాధ ఆయువతిని పెండ్లియాడుట కొప్పించినది. నేనును ఆమాల యువతియు చండాల వాటికకు చేరగా తన పితృగృహమును చూపినది. మాంసకండరముల చేతబట్టి నోటబెట్టుకొను బాలురను, ఆ బాలుర ముఖములపై మూగు యీగలను, వారివాకిటనున్న అడవి పందుల మాంస ఖండములను నాకొక మహా నరకమును స్మృతికి తెచ్చినవి? అది నాకు క్రొత్తమామగారి యిల్లు. ఈ పురుషుడు మన యల్లుడని వారిలో వారు అనుకొనుచుండ కొన్ని దినములు గడచినవి. ఇక నా వివాహ దినము వచ్చినది.

నా వివాహము జరుగుసమయమున అక్కడి మాలమాదిగలందరును త్రాగి తందనాలు త్రొక్కుచు బిగ్గరగ నరచుచు తప్పెటల మ్రోగించిరి. ఆ కన్యకను వివాహమాడి కొంతకాలము గడచినది. స్త్రీ పురుష సంతానములు కలిగినవి. అట్లు సంసారమున కొన్ని సంవత్సరములుకూడ గడచినవి. అంతలో భార్యాపుత్రుల పోషింప నేరని దుర్భరదారిద్ర్యము నన్ను హరించినది. ఆ దారిద్ర్యముతో

స్నేహమునకై ఉత్సహించుచు వచ్చినది మునసబీపనముకూడ. నాటి నా దారిద్ర్యము దేశదారిద్ర్యముగ కూడ పరిణమించినది. వర్షములు లేవు. దుర్భిక్షము నలుమూలల వ్యాపించినది. గడ్డిపోచయైనను భూమిపై నంకురించుటలేదు. మార్తాండుని ప్రచండ కిరణములలో అగ్నిమండలము కూడ ప్రవేశించినది. ఆయరణ్యమున దావాగ్నులు చెలరేగినవి. అప్పుడు కొందరు పారిపోవుటయు, కొందరా దావాగ్నులందే దగ్ధమగుటయు జరిగినది. అది వింధ్యారణ్య ప్రదేశము. కాని ఆ సందర్భమున నేనును నాభార్యా పుత్రులును ఆ ప్రదేశమును విడచి ఎట్టకేలకొక ప్రత్యేక ప్రదేశమును చేరితిమి. నాకు ముగ్గురు బిడ్డలు. అందొక పుత్రునిపై నా కధిక ప్రేమ. మిగిలిన యిద్దరు బిడ్డలను నా భార్య తన దగ్గరనే యుంచుకొని నిద్రించగా యీ బాలుడు నన్నాశ్రయించెను.

కాని ఆ బాలున కన్నములేదు. ఆకొన్న ఆ లేచిరుత వచ్చిరాని మాటలతో కన్నీరు బొట బొట కార్చుచు, నాయనా! నాకు తినుటకు మాంసమునిమ్ము. త్రాగుటకు రక్తమునిమ్ము. అని పలుమారు అడుగుచు, ఆకలిబాధ కోర్వలేక మరణము నొందు స్థితికి వచ్చెను. ఆ సమయమున దుఃఖము నేమని వర్ణింతును? నామనస్సు విరిగినది. మరణము శ్రేష్ఠమనిపించినది. ఆయాపదను గడచుట కంతకన్న నుపాయము లేదనిపించినది. సిద్ధమైతిని. నా భార్య నిద్రపోవుట చేత నన్నడ్డగించువారెవ్వరును లేరు. ఎండుకట్టెలను ప్రోగుచేసితిని. చితిని పేర్చితిని. ఆ అగ్నియు మండుట కారంభించినది. ఛటఛటా శబ్దములతో నన్నాహ్వానించినది. ఆ చితియందు ప్రవేశింపబోవు స్థితియే యీ సింహాసనమున నేను గడగడ వణకిన స్థితి.

నేను క్రిందపడబోవు సమయమిదియే. తరువాత మంగళవాయిద్య ములు మ్రోగగా మేల్కాంచితిని. ఇది నా చరిత్రయని చెప్పెను. వింటివా? విజయా!

వి - బహువిచిత్రము! కాని అప్పుడు మంత్రులేమనిరి?

కృ - మంత్రులు ఆ రాజు వర్ణించిన ప్రదేశమునకుకూడ వెళ్ళి తిలకించిరి. అచ్చట చండాల కన్యయు, రాజు గన్న సంతానము యున్నమాట నిజమే.

వి - అబ్బబ్బా! ఈ విచిత్రకథ నెవరు నిర్మించిరో?

కృ - వశిష్ఠ మునీంద్రులు శ్రీరామచంద్రునకు చెప్పిన కథ.

కృ - ఇదియే జాగ్రత్స్వప్నము. మాయాశక్తి ఒక సంకల్ప ప్రపంచము నుండి మరియొక సంకల్ప ప్రపంచమునకు మారిలించినది. ఇదంతయు జాగ్రదవస్థయందు కలిగిన తన్మయతయేగాని వేరొండు కాదు. ఇక నైదవది స్వప్నము. ఈ పదార్థమును నేను కొన్ని క్షణ ముల కాలమును మాత్రమే చూచితిని. అందుచే నిది యదార్థము కాదు, అని మేల్కొనిన పిమ్మట ఏయవస్థను గురించి విచా రింతుమో ఆయవస్థకు స్వప్నమని పేరు. ఆరవది స్వప్నజాగ్రత. స్వప్నమునుండి మేల్కాంచియు కొంతసేపు ఆ సంస్కారములే మనసును వెంటనంట ఆయవస్థయందలి అనుబంధ వికారములు (కలవరింతలు) స్ఫురించుచుండెనేని దీనికి స్వప్నజాగ్రతయని పేరు. ఏడవది సుషుప్తి. కేవలం జడరూపమై రాబోవు జాగ్రద్దుఃఖమును తెలిసికొను జ్ఞానబీజము మాత్రమే మిగిలియుండునవస్థకు సుషుప్త్య వస్థయని పేరు. ఈ యవస్థయందే సర్వప్రపంచములును లీన మగును. ఇవి అజ్ఞానభూమికలు.

వి - తరువాతి కర్తవ్యము.

కృ - వీటినుండి దాటుటకు ప్రయత్నించుటే.

వి - అవును. మొదటి ప్రయత్నమేదియో సెలవివ్వవలె తాము.

కృ - నిత్యానిత్య వస్తు వివేకము.

వి - అనగా ?

కృ - శాశ్వతమేదియో అశాశ్వతమేదియో మనస్సు చేత విచారించి, అశాశ్వతమైన దానిని వదలి శాశ్వతమగుదానినే సంపాదింప యత్నించవలెను.

వి - ఈజగత్ప్రపంచమునందు నీవనుభవించు సుఖము లన్నియు అశాశ్వతములని శాస్త్రములు చెప్పుచున్నవిగదా ? మనమాలోచించున దేమున్నది ?

కృ - అవును అదీ చెప్పినదీ నీ మనస్సునకు హత్తుకొనవలెనుగదా ? ఈ జగత్తంతయు అనిత్యమని ప్రతివాడును అనును. మన వెంట వచ్చునదేదియు లేదని ఒకొక్కొక్క సమయమున నిట్టూర్పులు వదలును. కాని వారి అనుభవము వేదాంతశాస్త్రము చెప్పిన అనుభవముకాదు. వారు మాట్లాడునది వేదాంతములు వర్ణించిన అనిత్యత అయినచో ఆ పలుకులు పలుకు వారందరును సనకసనందనులే యయ్యెడి వారు. వారుపలుకు అనిత్యత అంతా తాత్కాలికముగ వారలకు కలుగు నరముల బలహీనత. లేక వారు వరుగెత్తు ఆశాపథమున దురదృష్టము అడ్డురాగా కలిగిన స్పృహ. అందరును పలుకు అశాశ్వత పదము, జగత్తుయొక్క అనిత్యతో యథార్థముగా తెలిసి పలుకుటకాదు.

వి - యథార్థమును తెలియుట అనగానేమి ?

కృ - విషము మ్రింగినచో చావు దప్పదని ఎరిగిన వ్యక్తి విషమును మ్రింగునా ?

వి - మ్రింగడు.

కృ - ఆ విధముగా తెలియుటకే యథార్థముగ తెలియుట యని పేరు.

వి - ఈ జగత్తంతయు విషతుల్యమై కనబడవలెనందురా ?

కృ - జగత్తు విషతుల్యమగుటకాదు. తాననుభవించు భోగములు విషతుల్యములై తనకు మృత్యువును కల్పించునని తెలియవలెను.

వి - ఆభావమెట్లు దృఢమగునందురు ?

కృ - పరిశీలనచేతను నిరంతర మననముచేతను కలుగును.

వి - పరిశీలనా పద్ధతి ?

కృ - ఏ వస్తువు నీకు సుఖము నిచ్చుచున్నదని తలచుచుంటివో ఆ వస్తువును గురించి ఇది నాకెప్పుడును సుఖము నిచ్చుచున్నదా ? లేక దుఃఖమునుకూడ కలిగించుచున్నదా ? అని నీ దృష్టిని వెనుకకు త్రిప్పుటయే పరిశీలన.

వి - ఈ పరిశీలన విషయ సుఖములనుండి ప్రారంభమా ?

కృ - కాదు. నీవెక్కడనుండి ప్రారంభమైతివి ?

వి - పుట్టుకతోడనే నా ప్రారంభము

కృ - అక్కడనుండియే పరిశీలనకు ప్రారంభించు. గీతాశాస్త్రముకూడ వైరాగ్యము కలుగవలెనన్న దోషదర్శనమునకు జననమరణములు చాల ముఖ్యములని చెప్పినది.

"ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషాను దర్శనం॥"

తల్లి కడుపులో నీవుబడ్డ బాధను ముందు స్మరించు.

వి - అది యిప్పుడెలా స్మృతికి వస్తుంది ?

కృ - జీవులు మోహవిశేషమున దానిని మరతురనియే కొందరు మహానుభావులు శాస్త్ర ప్రబోధములచే స్మృతిని కల్పించిరి.

"ఆదౌ కర్మప్రసంగాత్ కలయతి కలుషం మాతృకుక్షౌ స్థితం మాం
విణ్మూత్రామేధ్యమధ్యే క్వథయతి నితరాం జాఠరో జాతవేదాః
యద్యద్వై తత్రదుఃఖం వ్యథయతి నితరాం శక్యతే కేన వక్తుం

ప్రాక్తన కర్మ విశేషమున మాతృగర్భమున ప్రవేశించితిని. అక్కడ నేను తిరుగాడు స్థలము లెవ్వి? నాతల్లి మలమూత్రగర్తములు. నాతల్లి గర్భమున వెలుగు జఠరాగ్ని గృహము. ఇవి నా సంచార స్థలములు అంతియే కాదు. అందు కృమికోశముకూడ నున్నది. ఆహా! నా చర్మమతి సున్నితము. జఠరాగ్ని జ్వాలలు కడుదీప్తములు. ఈ జ్వాలలచే పరితపించు నాకు చల్లదనమును చేకూర్చువారెవరు? అబ్బా! యీ జంతుజాలములు నన్ను బాధించుచున్నవి. నే నెవరితో మొరపెట్టుకొందును? స్వామీ! కరుణానిధీ! నా బాధలు చెప్పతరము కానివి. అని ప్రతి ముముక్షువునకు నాటి విషయమును జ్ఞాపకమునకు దావలెనన్నారు శంకరులు.

విజయా! అంతేకాదు. ప్రసవసమయమున నిన్ను ముందుకు త్రోయు ప్రసూతి వాయువుల ఒత్తిడి నిన్ను బాధించుచుండగా

మాతృగర్భమునుండి వెడలివచ్చు యోని ద్వారము సంకుచితమై యుండును కూడ. అప్పుడు కత్తిపోటులను నీవు తప్పించుకొన జాలవు. ఈ షట్టమంతా స్మరించు కొనవలెనన్నది గీతాశాస్త్రము. భారతీయులసలు ఈ జన్మను రూపు మాపవలెనని ప్రయత్నించు చుండగా పాశ్చాత్యులు సుఖప్రసవమునకు మాత్రమే పరిశీలించు చున్నారు. కపిలాచార్యుడు దేవహూతితో గర్భస్థ జీవుడేమని తల చునో వర్ణించినాడు.

చ. పరగుచునున్న దుర్వ్యసనభాజనమై ఘనదుఃఖమూలమై
యరయగ బెక్కుతూంట్లుగలదై క్రిమిసంభవ మైనయట్టిదు
స్తరబహుగర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాభ భూరిభవసాగర తారక పాదపద్మముల్.

ఈ విధముగ ప్రతి నిత్యమును తలపోయుట అత్యవసరము.

తరువాతిది బాల్యము. మూత్రపురీషములతో కూడి దోమల బాధను తొలగించుకోలేని దుస్థితి. ఆకలి దప్పులకు పరాధీనత.

శైశవావస్థయు మనస్సును ఒక్కతీరుననే యుండునని రామచంద్రులు వర్ణించిరి. దేనియందు? అసంభవములనుకోరుటయందు. చంద్ర మండలమును చేతికందించుమనుటయందు.

"శైశవం చ మనశ్చైవ సర్వాస్వేవ హి వృత్తిషు
భ్రాతరావివ లక్ష్యేతే సతతం భంగురస్థితీ"॥ వై. ప్ర.స.19

తరువాతది యౌవనము. ఇది మహానరకబీజము. అంతేకాదు. అనిత్యము. భగవంతుని పరిపాలనమున దుష్టుల శిక్షాస్థానములై యుండునదియొక్క మహానరకములున్నవి. ఆమహానరకములకు మనలను పంపవలెనన్న యౌవన మొక్కటే సమర్థమైనదని అనుభ

వజ్ఞాలమాట. మాయాదేవి పరిపాలించు సామ్రాజ్యమున భ్రమయను ముఖ్యపత్తన మొకటున్నది. ఆ పట్టణము కూడా యౌవనము యొక్క స్వాధీనముననే యున్నది. యౌవనమునకు స్నేహితులు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు. నీతి భ్రష్టులు కావలెనంటే యౌవనమే కావలె. రావణ కుంభకర్ణులు మనమీదికి రావలెనంటే మన యౌవనావస్థను సహాయముగొనియె వత్తురు.

శ్లో॥ మహానరక బీజేన సంతత భ్రమదాయినా
యౌవనేన యే నష్టానష్టానాన్యేన తేజసాః॥ వాశిష్ఠము

జరా. ముసలితనమందువా? దానిని గురించి చక్కని పద్యమును చెబుతాను.

చ. తనువు ముడుంగు బాదగతిదప్పును దంతములాడుజీకటుల్
గనుగవ వర్తిలుం జెవుడుగ్రమ్మును జొంగలుగారు మోమునన్
జనములు మాట చేకొనరు సన్నిధిజేరదు భార్య పుత్రుడుం
గానకాని శత్రువట్ల తిరుగుం గడుకష్టము వృద్ధదేహికిన్.

వ్యాధులు, వియోగములుకూడా యీ ముసలితనమునకు చెందినవే.

"వృద్ధస్తావచ్చింతాసక్తః" అన్నారు శంకరులు

"జరాచంద్రోదయ సితే శరీర నగరే స్థితే
క్షణాద్వికాసమాయాతి మునేమరణ కైరవం"॥

శరీరమను పట్టణమున ముసలితనమను పూర్ణచంద్రుడు ఉదయించగనే ఒక్కక్షణకాలమున మరణమను కలువలు వికసించుచున్నారు.

ఇట్టి దోషములను ప్రతినిత్యమును స్మరించుతుంటే వైరాగ్యము వృద్ధియౌతుంది.

ఇక విషయసుఖముల సంగతి.

మానవశరీరమునకంటె నికృష్ట శరీరములను ధరించిన జంతువు లలో లేడి, ఏనుగు, మిడుత, చేప, తుమ్మెద అనునవి. ఆ జంతు వులలో ఒక్కొక్క జంతువు ఒక్కొక్క యింద్రియసుఖమును కోరి తమతమ జీవితములను కోల్పోయినవి. అందు లేడికి సంగీత మన్న ఇష్టము. శ్రోత్రేంద్రియము దానిని వంచించినది. లేడిని పట్టుకొనదలచిన కిరాతుడు వలనువన్ని వేణునాదమును చేయగా ఆ నాదమునకు ముగ్ధమై కిరాతుని వలలో చిక్కును. ఈ లేడిని బం ధించినది చెవి. ఏనుగు స్పర్శసుఖమును కోరును. అది ఆడ ఏనుగుద్వారా పట్టుబడును. దీనిని బంధించినదీ త్వగింద్రియము (చర్మము). మిడుతకు ఎర్రని రంగు ఇష్టము. చక్కగా వెలిగే దీపము, మండుతున్న నిప్పు దాని కన్నులకింపుగూర్చగా ఆమిడుత అగ్నిలోపడి దగ్ధమగును. దీనికి మృత్యువు నేత్రేంద్రియము. చేపకు ఎర్ర అనే పురుగు చాల రుచియగు పదార్థము. ఆ ఎర్ర అను పురుగు దననోటికి ఎప్పుడు అందునాయని చేప ఎదురుచూచు చుండును. చేపలను పట్టువాడా ఎర్రనుతెచ్చి గాలమునకు కట్టి చేపనుపట్టును. చేపకు మరణము నిచ్చినదీ జిహ్వేంద్రియము (నాలుక). తుమ్మెదకు గంధఫలి అనిపేరు. ఆ జంతువు సువాసనకు వశమగును. పుష్పజాతియందు మనోహర సుగంధమును వెద జల్లునది సంపెంగ. ఆ సంపెంగలోని గంధమే తుమ్మెద ప్రాణ మును తీయును. తుమ్మెద వశమైనదీ ఘ్రాణేంద్రియమునకు (ముక్కు). ఈ విధముగా ఒక్కొక్క జంతువు ఒక్కొక్క యింద్రియమునకు వశమయ్యే నాశమునొందగా, శబ్దస్పర్శరూప

రసములను విషయములకు వశమై పంచేంద్రియములకు పట్టుబడు మానవుని గతిని ఏమని వర్ణించవలె? మానవుడే ఆ భోగవాసములను వీడి ఆ భోగములను వర్జించెనేని ముక్తికాంత అతనిని వరించును. లేక ఆ భోగములే మానవుని వదలవలసి వచ్చెనో ఆ భోగములే మృత్యుదేవతను మానవున కందించును. ఒక మహాకవి యన్నమాట యిది.

చ. ఉరుగతికోడ నేగు దరవుండియు భోగములు అట్టివానిదా
నరుడు పరిత్యజింపడు కనంగన తద్వరహంబు భిన్నము ఏ
పురుషుని భోగముల్ విడిచి భూరి మనోవ్యథ లాచరింమునా
పురుషుడె భోగముల్ విడిచి పొందు నిరామయశాంతి సౌఖ్యముల్

విజయా! ఆ భోగములు రెండు విధములు. ఒకవిధము యీ మానవశరీరమున యీ లోకము నందే అనుభవించునవి. రెండు స్వర్గాది లోకములం దనుభవించునవి. కాని యీ రెంటినికి క్షయము తప్పదు. ఇప్పుడు ముముక్షువగువాడీ రెండువిధములగు భోగములను అనిత్యములే అను నిశ్చయము నొందవలెను. ఈ విషయమునే గీతాచార్యులు 5వ అధ్యాయమున 20, 21, 22 శ్లోకములవర్ణించి, 9వ అధ్యాయమున 20, 21 శ్లోకములందుకూడా వర్ణించినారు. అయిదవ అధ్యాయమునందలి 20, 21 శ్లోకములలో ఆత్మనిష్ఠయందలి సుఖమక్షయ సుఖమని బోధించి, యిరువది రెండవ శ్లోకమున విద్వాంసు లెవరును ఆద్యంతములతో నొప్పు విషయ సుఖములను కాంక్షించరని పండిత పామరుల నిద్రను విడదీసియే చూపిరి. తొమ్మిదవ అధ్యాయమున లోకాంతర

భోగములుకూడా వట్టివే అను విషయమును 20, 21 శ్లోకముల వ్యాఖ్యానించిరి.

"న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియం
స్థిరబుద్ధిరసంమూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః 5–20
"బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥" 21

ఈ రెండు శ్లోకములును బ్రహ్మ నిష్ఠని స్వరూపమును దాని ఫలమును వర్ణించినవి. ఆత్మసుఖమొక్కటే నాశము గానిదని నిక్షయించినవి.

"యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥ 22

ఆత్మజ్ఞానము కావలెనన్న ముముక్షువునకు విషయ సుఖములందలి వైరాగ్యము దృఢము కావలెను. ప్రలోభపెట్టు సన్నివేశములను కూడ యితడెదుర్కొనదగు ధీరుడైనప్పుడే ఆత్మతత్వమును కనుకొనగలడు.

- దీనిగొక్క ఆదర్శకథ నందించెదరా?

౨ - అలాగే.

నచికేతుని ఉపాఖ్యాన మిందుకు చక్కని ఆదర్శము. నచికేతుడను నాతడు వాజశ్రవసుడను మహర్షి పుత్రుడు. వాజశ్రవసునకు వాజశ్రవసుడను పేరు బిరుదాంకితము. వాజమనగా అన్నము. అన్నదానమును విరివిగ చేయుటచేత అతనికి వాజశ్రవసుడను పేరు వచ్చినది. లేక వాజశ్రవుని పుత్రుడు కనుకను వాజశ్రవసుడు కావచ్చును.

ఒకప్పుడి మహర్షి విశ్వజిద్యాగమును జేసి దాని ఫలమును తానే అనుభవింపదలచెను. ఆయన కర్మ భగవదర్పితము కాలేదు. కాని ఆ యాగమునకు దక్షిణ నివ్వవలెనుగదా? ఆ యాగమును నిర్వర్తించిన ఋత్విక్కులకును సదస్యులకును తనకున్న ధనము నంతయు నిచ్చుటయే యీ యాగము యొక్క విధి. అందువలన నామహర్షి తనకున్న ధనమునంతయు నొసంగి, అందు కొన్ని గోవులనుకూడ ఋత్విక్కుల కొసంగెను. అతని పుత్రుడగు నచికేతుడు బాలుడే. అయ్యును అతని సంస్కారము మాత్రము ప్రౌఢము. తండ్రి ఋత్విక్కుల కందించిన గోధనమాతని కంట బడినది. కాని నచికేతుడా దానమునకు తృప్తిపడలేదు. తండ్రి యజ్ఞఫలము దక్కదని అతని నిర్ణయము. కారణమేమి ? దాన మొసంగిన వస్తువును బట్టియు, గ్రహించిన పాత్రలనుబట్టియు దాతకు దానఫలమబ్బును. ఈ ఘట్టమున గ్రహీతలు అర్హులైనను దానమొసగబడిన గోవులు మాత్రము బక్కచిక్కియున్నవేగాని బలసియున్నవి కావు. గడ్డిమేసియు చక్కగా నెమరవేయ గలిగిన శక్తి వాటికి లేదు. నీళ్ళుకూడ త్రాగలేని స్థితిలో నున్నవి. పాల సంగతి చెప్పనవేమున్నది? వాటి యింద్రియములే వాటి స్వాధీనమునలేవు. అటువంటి గోవులను దానమొసంగిన దాతకు స్వర్గమెట్లున్నను నరకము తప్పదు.

తనతండ్రి నరకమున బడునను బాధ నచికేతునకు కలిగినది. ఆ మహనీయుని నరకబాధ నెట్లు తప్పింతును? అన్నదే నచికేతుని విచారము. అందుకు తన ఆత్మత్యాగము అవసరమనిపించినది. తండ్రిని తండ్రీ! అని సంబోధించి, నన్ను కూడ యీ దక్షిణకు

ధనముగా గ్రహించి ఎవరికివ్వ దలచితిరి? అని ప్రశ్నించెను. తండ్రి పలుకలేదు. నచికేతుడు బాలుడుగదా? మరల మరల ప్రశ్నించెను తండ్రి కోపించి, రే! నిన్ను మృత్యువున కివ్వదలచితి ననెను. వాజశ్రవసమహర్షి పలుకులకు నచికేతుని హృదయమెందుకు తపించదు? నచికేతుడు గురుశుశ్రూషల గావించుటలో ఉత్తమ శ్రేణికి చెందిన మహానుభావుడు. లేక మధ్యతరగతికైనను వచ్చును గాని అధముడుకాడు. నచికేతుడు ఆత్మపరీక్షను గావించుకొను ఉత్తమ సంస్కారము కలవాడు. తనను తాను విచారించుకొనెను. తానధమశ్రేణిలోనివాడుకాడు. తన తండ్రి మత్యువున కెందు కిచ్చెను? నా పితృమూర్తి యట్లు పలుకుటకు కారణమేమి? అని విచారించి తండ్రికి వచ్చిన భావము ఆగ్రహమేనని అతడు నిశ్చయించుకొనెను. తండ్రీ! యని సంబోధించి తప్పక నన్ను యమునికడకు పంపుడు. సత్యవాదులుకండు అని ప్రార్థించెను. విజయా! ప్రాక్తనసంస్కారము లెట్టివో గ్రహించితివా ?

వాజశ్రవసుడును పుత్రవ్యామోహమును వదలి సత్యవాదియయ్యెను. నచికేతుడు యముని మందిరమున కేగెను. నచికేతుడా యమధర్మరాజున కతిథి. యముడు గృహమున లేడు. మరియా అతిథిని సత్కరించువారెవరు? మూడు దినములు గడచినవి. వైవస్వతుడిలు చేరుట జరిగినది. యమునకు నచికేత దతిథియై వచ్చినట్లు తెలసినది. వినుటయే తడవుగా స్వగృహస్థు పాద్యార్ఘ్యముల గ్రహించి నచికేతునివద్దకు వెళ్ళి విప్రోత్తమా! నీకు చేయదగిన అతిథి సత్కారముల గావింపక మూడు రాత్రులు గడచినవి.

మూడు రాత్రులకును మూడు వరముల నీయదలచితినని, మూడు వరములను కోరుకొమ్మనెను.

నచికేతుని వరములివి. తనను యమునింటికి పంపినదానికై తండ్రికెట్టి చింతయు లేకుండుటయు, తాను గృహమునకు వెళ్ళగా తనను పుత్రునిగా నమ్మి పరిగ్రహించి క్రోధము లేనివాడై యుండుటయు, మొదటి వరము. స్వర్గమువిచ్చు అగ్నిచయనమను క్రతువును గురించిన విజ్ఞానమును తెలుపుట రెండవ వరము. మూడవది మరణమును గురించిన విచారము.

యముడు మొదట సమ్మతించెను. నచికేతుని మూడవవరమును మరపించి పంపవలెనని నిశ్చయించెను.

మూడవ వరమునకు బదులుగా మరొక వరమును కోరుకొమ్మనెను. నచికేతుని చిత్తము ఆత్మోద్ధరణ పారిజాతము, తానావరము తప్ప వేరొక వరమును కోరననెను. యముడు భూలోక సౌఖ్యములు కాక స్వర్లోక సౌఖ్యముల నన్నిటిని యిచ్చెదనెను.

యే యే కామా దుర్లభా మర్త్యలోకే
సర్వాన్ కామాగ్శ్ఛందతః ప్రార్థయస్వ॥

విజయా! ఇటువంటి వరము నెవ్వడు వదలుకొనును? కాని నచికేతునకు స్వర్గసౌఖ్యములలోని దోషములేవియో దృఢముగా తెలియును.

వైవస్వతా!

శ్వోభావా మర్త్యస్య యదంతకైతత్
సర్వేంద్రియాణాం జరయంతి తేజః
అపి సర్వం జీవిత మల్పమేవ
తవైవ వాహాస్తవ నృత్యగీతే॥

స్వర్గసౌఖ్యములు తుచ్ఛములని నిర్ణయించుకొని మీసాలపై తేనియ లని చెప్పిన ప్రవరునికంటె మంచిచరిత్రయే గదా? నచికేతునిది? పై వస్తుతుని సంబోధించి నీవొసంగు భోగములు నాయింద్రియపాట వమునంతయు నశింపచేయునేగాని శాశ్వత సౌఖ్యముల నీయజాలవు గదా? నాకున్న ప్రజ్ఞా, బల, వీర్యములను నాశము చేయును. లేక ఆ భోగముల ననుభవించ వలెనన్నను ఆయువు చాలదు. బ్రహ్మ కున్న యాయుర్దాయము నిచ్చెదనందువా? భోగానుభవమున మత్తెక్కిన ప్రాణికి బ్రహ్మాయుర్దాయమును అల్పమే యగును. కావున తామిప్పుదలచిన స్వర్గధనము నంతయు తామే యుంచుకొనండి అంటూ—

"వరస్తు మే వరణీయస్సఏవ" మూడవ వరమును మార్చుకొనలేదు. ఇట్టిది ఆముష్మిక ఫలభోగ విరాగము.

ఈ సమాధానమును నీకు వినిపించుట కొరకే పై చెప్పిన కథన మంతయు. ఇక పార్థుని వ్యవహారమును గమనించు.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖానిచ
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేనవా
"ఏతాన్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే"॥

అర్జునునకు రాజ్యమును రాజ్యభోగములును వాటితో తులతూగిన జీవితముకూడ ఒక తృణప్రాయమై పోయినవి. త్రిలోక సామ్రాజ్య మును తన కక్కరలేదనిపించినది. శత్రుజయమును దానివలన కలుగు యశస్సులనునవి, జీవితమునే వదలుకొన్న అతని కెంత

లెక్క? ఆత్మజిజ్ఞాస కలిగిన ముముక్షువున కీ పద్యములోని సందేశము దివ్యౌషధము.

చ. జలదములోని క్రొమ్మెరుగు ఛాయలు భోగపరంపరల్ మహా
విలపరిపట్టితాబ్దదళనీరతుషారము జీవితంబు చం
చలతరముల్ వయోభిమతసౌఖ్యము లీగతి నాలకించిన
ఘ్యలు పరమాత్మయోగమున బుద్ధిఘటించుడు సత్వరంబుగన్.

నేటి ప్రసంగమంతయు ప్రయత్నము మానవ కర్తవ్యమను దాని పైన నడచినది. జిజ్ఞాసువుయొక్క అభ్యాసముల సంగ్రహము రేపు.

ఓం తత్సత్

వి - "గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణాం
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః॥

...)o(...

# గీతాహృదయము

## —: సాధనలు :—

కృష్ణానంద విజయుల గీతాగోష్ఠికిది మూడవరోజు. కృష్ణానందులు గురుస్థానమును, విజయుడు గురువర్యుల పాదపీఠమును అలంకరించి యుండిరి. నేటి గోష్ఠి గురువర్యుల శాంతి గీతాలాపమున ప్రారంభమైనది. ఆ మధుర గీతమిది.

కృ : శ్లో॥ నిత్యాఽనిత్యవిచారణా ప్రణయినీ వైరాగ్యమేకం సుహృత్
సన్మిత్రాణి యమాదయః శమదమప్రాయాః స్వ హాయామతాః
మైత్ర్యాద్యాః పరిచారికాః సహచరీ నిత్యం ముముక్షాఽబలా
దుశ్ఛేద్యా రిపవశ్చ మోహమమతా సంకల్పసంగాదయః॥

ఈ గీతము ప్రబోధ చంద్రోదయమను నాటకమున శ్రద్ధయను పాత్రముఖముగా వెలువడినది. ఇందు వర్ణింపబడినది పరమార్థ ప్రపంచమున చరించు ముముక్షువుయొక్క కుటుంబ వర్ణనము. ఈ గీతమున వర్ణించబడిన గృహస్థు శాశ్వతానంద సంధాయినిసై తన్నొక్కక్షణమైనను విడిచియుండని యిల్లాలిని గ్రహించిన రసజ్ఞమూర్తి. ఈతని విహారము ఇంద్రజాల వినిర్మిత సౌధోపరిభాగములందు గాక బ్రహ్మవిద్యాలంకృతము లైన ఉపనిషత్సారస్వత సౌధములలో శాశ్వతానంద సంధాన చంద్రశిలా తలముల జరుగుచుండును.

పాఠకులారా !

నిత్యానిత్య వస్తు విచారమీతని ప్రాణనాయకి. వైరాగ్యమీతని సుహృత్తు, యమ, నియమ, ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన

వమాధుకుమ, శమదమతితిక్ష ఉపరతి శ్రద్ధా సమాధానములను, పేర్లబరి గిన నిత్య సత్యమూర్తుల్ గృహస్థునకు మంత్రులవలె సలహాదారులై యుందురు. ఈతని పరిచారికాగణము మైత్రి, కరుణ, ముదిత ఉపేక్షలను వారు. ఈతనికి సఖురాలై ప్రవర్తించునది మోక్షసక్తి. మోహము, మమ త్వము, సంకల్ప వికల్పములతో ఉయ్యాలలూగు చిత్తము ఈతని శత్రు వర్గము. ఇది జ్ఞానవిద్యా గృహమునందున్న గృహస్థుయొక్క సంపద.

ఈ సంపదనే శమాదిషట్క సంపద అని శంకరులును, జ్ఞానము అనుపేర గీతాచార్యులును నిర్ణయించిరి. మోక్షసామ్రాజ్య లక్ష్మీవిహార మునకీ గుణ సంపదయే లలితోద్యానవనమని భారతీయ తత్వవేత్తల నిర్ణయము. ముముక్షువున కంతరంగ సాధనలైన శమాదులను వ్యాసమునికూడ యీ క్రింది విధమున సూత్రీకరించిరి.

శమదమాద్యుపేతః స్యాత్తథాపి తు తద్విధేస్తదంగత
యా శేషావశ్యానుష్ఠేయత్వాత్ ॥ 3. అ. 4. పా. 27. సూ.

యజ్ఞాదులవలెగాక శమదమాదులు జ్ఞానాభ్యాసమునకు అవశ్యాను ష్ఠేయములని సూత్ర తాత్పర్యము.

వి - ఈ జ్ఞానసాధనలను గీతాచార్యులెక్కడ వర్ణించిరందురు ?

కృ - 13 అధ్యాయమున 7వ శ్లోకమున కొన్ని ఆత్మ గుణములను వర్ణించిరి.

వి - 7వ శ్లోకము మొదలు 11వ శ్లోకము వరకును వర్ణించి, ఆ గుణ ములకు కూడా జ్ఞానమనియే పేరు పెట్టిరి కదా ?

కృ - అవును. ఆ గుణముల వలన జ్ఞాననిష్ఠ కుదురును గనుక వాటికిని జ్ఞానమనియే పేరుబెట్టిరి. జ్ఞేయమును గుర్తెరుగుట కవి ఉపకర

ణములు. ఆ ఉపకరణములను సంపాదించుకొన్నవాడే ఆత్మజ్ఞాన
మును సంపాదింప సమర్థుడగును. "అమానిత్వాగుణం జ్ఞాన సాధన
త్వాత్ జ్ఞానశబ్దవాచ్యం విదధాతి భగవాన్" అని భాష్యకారులు
చెప్పిరి. అయ్యెను అందు కొన్ని విషయములను సీకిటివరలో
నిర్ణయించియే యున్నాను. ప్రకృతమున యేడవ శ్లోకములోని
గుణగణమును మాత్రము చర్చింతును.

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవం
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః॥

మానవుని జీవచ్ఛవము చేయు గుణము మానము. మానమనగా
ఆత్మస్తుతి. తనను తానే పొగడికొనుట.

"మానినో భావః మానిత్వం ఆత్మనః శ్లాఘనం.
తదభావో అమానిత్వం"॥ శం. భా.

దీనిని గురించి మహాభారతమందలి సన్నివేశము నొకదానిని
చూపుదుమ.

కర్ణ పర్వమునందలి కథ. కర్ణుడు తీవ్రమగు పోరాటమునుగావించు
సమయమది ధర్మజు డా సమయమున కర్ణుని చేతిలో ఓడిపోవుట జరిగినది.
ఓడిపోవుటకాదు. ధర్మజునకు కలిగిన భీతికి ఎక్కడ చూచినను కర్ణుడే
కనబడుట జరిగినది. ఆ సందర్భమున కృష్ణార్జునులు వేరొక రంగస్థల
మునుండి ధర్మజుకడ కరుదెంచిరి. అర్జునుని చూడగనే కర్ణ వధ గావిం
చియే తనకడ కర్జునుడు వచ్చియుండెనని భావించి, కర్ణ వధను గూర్చి
ప్రశంసించెను. కర్ణ వధ జరుగలేదని పార్థుడు చెప్పగా అదరిపడి అర్జు
నుని నిందించుటలో పార్థుని గాండీవమును శ్రీకృష్ణుని చేతికిచ్చివైచుట
యుక్తమని అర్జునుని కించపరచెను. పార్థునకది భరింపరాని యవమానము.

అది కేవలము తన వీరత్వమునకు సంబంధించిన యవమానము కాదు. అర్జునుడు తన గాండీవమును ఎప్పుడైనను ఒరులకిమ్మనిరేని వారి శిర మును ఖండింతునని అతడు ప్రాంశు(?)వ్రతమును అవలంబించియుండెను. ఉపాంశువ్రతమన ఒరులకు తెలియని శపథము. ఆ శపథమును ధర్మజు డెరుగడు. ఈ ఘట్టమున ధర్మజుని శిరము ఖండింపక అర్జునునకు తప్పదు. పార్థుడు వెంటనే వొరనుండి ఖడ్గమును పెరికెను. విజయా ! ఇది ఎంత విషమఘట్టమో పరికించితివా ? ధర్మ నిర్ణయము బహు సూక్ష్మము. భగవత్తత్త్వమెంత సూక్ష్మమో ధర్మనిర్ణయము కూడనట్టిదే. కావుననే ఆ రెంటిని మానవబుద్ధి నిర్ణయింపజాలదు. శ్రుతి స్మృతులే ఆ నిర్ణయము లను గావింపవలెను. వేదవేద్యమైన బ్రహ్మతత్త్వ మచ్చటనేయున్నది. ధర్మార్థములు సమీపముననే యున్నది. మూలచ్ఛేదమును గావించునది పాండి త్యము కాదు. మూలచ్ఛేదమును చేయునది ధర్మము కూడ కాదు. అర్జునుని శపథమునకు భంగము వాటిల్లకూడదు. అతడు నరకమున కూలును. ధర్మ జుడు బ్రతుకుటయు ముఖ్యమే. స్వర్గనరకములను న్యాయస్థానమందలి శాసనములను విశదీకరించదగిన న్యాయవాది శ్రీకృష్ణుడు. తాత్కాలికావసర ములకు నూతన శాసనములను అప్పటికప్పుడే చేయదగిన అవసరము ఖార తీయ న్యాయశాస్త్రమున లేదు. వెంటనే శ్రీకృష్ణుడు పార్థా ! పూజ్యులైన వారిని వ్యాజ్యాక్షేపమున నిందింపనను చంపుటయేనని అర్జునునిచేత ధర్మజుని నిందింపజేసి, అర్జునుని శపథమును రక్షించెను. కాని అర్జునుడు ధర్మజుని నిందించిన పాపమునకు తాను దేహత్యాగమును చేయుటయే ప్రాయశ్చిత్త మని నిర్ణయించుకొనెను. కత్తిని ఒరయందుంచలేదు. అర్జునుని మరణ మును కూడ నిర్ణయించదగినవారు శ్రీకృష్ణులే గదా? అర్జునా ! ఆత్మస్తుతి కంటె దేహత్యాగము పెద్దదేమీ గాదు. దేహాత్మబుద్ధితో గావించు మరణమును,

దేహాత్మబుద్ధితోడ గావించుకొను ఆత్మస్తుతియు ఒక్కటే. కావున నీపీ ఘట్టమున విన్న నీవు పొగుడుకొనుమని, అతడు గావించిన మహాత్కార్యములనన్నిటిని ఆ పార్థుని ముఖముననే వర్ణింపజేసికొనునట్లు ఆజ్ఞాపించెను. ఆత్మ ప్రశంసయే మానిత్వము. అది లేకపోవుటయే అమానిత్వము. విజయుడు కొన్ని క్షణములు మాటాడలేదు.

కృ - అర్థమైనదా ?

వి - భారతీయ ధర్మసూక్ష్మములకు నా చిత్తమొక్క క్షణమాత్రము స్తబ్ధమైనది అంతియే. విషయము విశదమైనది

కృ - దంభమనగా తాను చేయుచున్న స్వధర్మ నిర్వహణనుగాని లేక నైమిత్తికములైన వ్రతదీక్షలనుగాని పలువురు కొనియాడునట్లు కనబరచి నటించుట "స్వధర్మ ప్రకటీ కరణత్వం దంభత్వం" శం. భా.

ఈ దంభుడు లోభుని పుత్రుడు. అహంకారమునకు మనుమడు. ఈ దంభుని వికటాట్టహాసవిలయతాండవమే ఐహికాధ్యాత్మిక రంగస్థలములలో నేడు తాండవించుచున్నది. మూడవది అహింస తరువాతది క్షాంతి. పరులొనర్చిన అపరాధమునకు మనస్సు వికారము నొందక ఓర్పు చెందుట.

"పరాపరాధ ప్రాప్తావ విక్రియా"

వి - కష్టమే.

కృ - అభ్యాసకాలమున కష్టము కావచ్చును. ఆదర్శ పురుషులనుండి ఆ గుణమును గ్రహించుట అవసరము.

వి - అట్టిపాత్ర నొకదానిని సాధకున కందించుట అవసరము.

కృ - పరీక్షన్నరేంద్రుడు డీ ఘట్టమున ఆదర్శపాత్ర. పరీక్షన్నరేంద్రునకు శమీకుని పుత్రుడైన శృంగి మహర్షి వలన శాపము వచ్చినది. ఆ శాపము సామాన్యమైనదికాదు. ఏడురోజులలో పరీక్షత్తునకు తక్షకుని చేతిలో మరణము వచ్చును. తక్షకుని విషాగ్నికీలలకు దగ్ధమైపోవునట్టి ఘట్టమును కల్పించిన శృంగిమహర్షిని తిరిగి శపించగలిగిన సామర్థ్యముండియు నరేంద్రుడు చూపిన సహన మెట్టిదో చూడుము. పరీక్షన్నరేంద్రునకు శమీకమహర్షి తన పుత్రుడిచ్చిన శాపమును కబురు పంపినాడు. తన పుత్రుని తప్పిదమును కూడ ఒప్పియే తెలిపినాడు. ఆ సందర్భమున నరేంద్రుని భావమిదీ.

> "పాము విషాగ్నికీలముల ప్రాణము లేగిన నేగుగాక యీ భూమియు రాజ్యభోగములు బోయిన నిప్పుడపోవగాక సౌ దామిని బోలు జీవనము తథ్యముగా తలపోసి యింక నే నేమని మాఱుతిట్టుదు మునీంద్రకుమారకు దుర్నివారకున్.

నరేంద్రుడు మరల శపించగలడు. కాని శపించలేదు. సహన శీలుడై తన బాహ్యశరీరమునకు సంబంధించిన సామ్రాజ్యమునంతను మెరుపుతీగెవంటిదని గుర్తెరిగి, ఆత్మ సామ్రాజ్యము సంపాదించు టకు గంగానది ఒడ్డున ప్రాయోపవిష్టుడయ్యెను. క్షమ అనగా యిది.

వి - మరి మన దేశనాయకు లెందరో స్వరాజ్య సంపాదనకు ఓర్పు వహించిరిగదా ? అది క్షమ కాదా ?

కృ - అది క్షమకాదు. యుద్ధ సామగ్రిలేనివారు యుద్ధ సామగ్రి కలవారిని జయించు రాజనీతిలోని యొక భాగము. గౌణ్యార్థమున ఒకవేళ

అంశాంశమును ఒప్పినను రాధ్యర్థమున మాత్రము కుదరదు. ఒక చోరుడు రాజభటులచే దండించబడుటకూడ తన రహస్యమును బయటపడకుండుటకు చూపు సహనము ఆధ్యాత్మిక శాస్త్రము నిర్వ చించిన సహనముకాదు. ఒక మహాకవి, లేక విమర్శకుడు ఋషు లకు కలిగియుండు గుణములన్నియు మాయందును యున్నవి, కాని ఆ ఋషిసత్తములకు కలగు సత్ఫలితములు మాత్రము మాకు వచ్చుటకు అర్హతలేదని తెలియజేసెను.

వి - అదెట్లు?

కృ - కర్తయొక్క లక్ష్యమునుబట్టి గుణక్రియలకు ఫలము. తపస్వి చేయు నేత్రనిమీలనమును, ఏకాగ్రతయు మార్జాలబకములు గూడ గావించును. లక్ష్యములలో భేదమున్నదిగదా?

వి - చిత్తము. ఆ కవివాక్యమును వినిపింతురా?

కృ - భర్తృహరి శ్లోకమున కాంధ్రానువాదము.

> క్షమచేగా దవమానమోర్చుట, మహాసంతుష్టిచే గాదు గే
> హమునందైన సుఖంబుమానుట, తపోవ్యాసక్తిచేగాదు దు
> ర్దమ శీతోష్ణ జయంబు, కాదు హరుపై ధ్యానంబు, విత్తంబుపై
> నమరెన్ మాకు, మునీంద్రకృత్యములు లేవాసత్ఫలాభ్యు
> న్నతుల్.

అంతేకాక రాజకీయనాయకుని కారాగృహవాసము చోరుని కారా గృహవాసము వంటిదెట్లు కాదో అట్లే రాజకీయములోని క్షమ వేదాంతశాస్త్రము నిర్వచించిన క్షమ కాదు.

వి - నేటికి నా అనుమానము తీరినది.

కృ - తరువాతది ఆర్జవము. ఆర్జవమనగా నిర్వ్యాకత. హృదయ పూర్వక మగా మాట్లాడుట. ఈ గుణములు లేని వానికి ఆత్మజ్ఞాన ముదయించదు. ఉదయించియు ఆత్మశాంతి నివ్వదు.

శ్లో॥ అవమానిత్వాది నిష్ఠో యో యశ్చాద్వేష్టాదీ సాధనః
జ్ఞానముత్పద్యతే తస్య న బహిర్ముఖచేతసః॥ అ.4. శ్లో 68
సర్వవేదాంత సంగ్రహము.

అమానిత్వాది గుణములందు ఎవడు నిష్ఠుడగునో వానికే ఆత్మజ్ఞానోదయముగాని బహిర్ముఖమైన శుష్కవేదాంతికి ఆత్మజ్ఞానము లభించదని యీ శ్లోక తాత్పర్యము. పై గుణము లన్నియు వైరాగ్యమను గుణముపైన ఆధారపడి యున్నవి. వైరాగ్యము, మంద మధ్యమ తీవ్రములను మూడు భాగములై యున్నది. తీవ్రవైరాగ్యమునగాని జ్ఞానోదయము కాదు.

శ్లో ॥ వైరాగ్యం చ ముముక్షత్వం తీవ్రం యస్యతు విద్యతే
తస్మిన్నేవార్థవంత స్యుః ఫలవంత శ్శమాదయః॥ 30
వివేకచూడామణి.

వైరాగ్యముముక్షత్వములు తీవ్రములుకానిదే గురుపర్యుల పాదముల నాశ్రయించడు. సంసారమును చూచి భయపడినప్పుడే నిర్భయమైన స్థానమును వెదకుట జరుగును. గురుపాదముల నాశ్రయించుట సంసార భయభీతిని పోగొట్టుకొను యత్నములోనిదే. సంసారమును చూచి భయభ్రాంతులగు భీరువులు ఆత్మవీరులై విరాజిల్లుచుండ, ఆత్మజ్ఞాన భీరువులు జననమరణ ప్రవాహరూప సంసార సముద్రమున వీరశిఖామణులై యీదుచుందురు.

ఈ ఘట్టమున సంసారభీరువై తన భీరుత్వము నొప్పుకొన్న ఒక మహనీయుని వాక్యము తప్పక స్మరణీయము.

మ. ఖరదంష్ట్రాభ్రుకుటీసటానఖయు మగ్రధ్వానయున్ రక్తకే
సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ
నరసింహాకృతి జూచి నే వెరవ ఘూర్ణత్క్రూర దుర్వార దు
ర్భర సంసారదవాగ్నికిన్ వెరతు నీపాదాశ్రయుం జేయవే

ఇతడు ప్రహ్లాదుడు. ఇతడొప్పుకొన్నంత భయము సాధకునకు గలిగిననే ఆచార్య వరణమునకు సార్థక్యము.

—: గు రు వ ర ణ ము :—

ఈ ఘట్టమున రామకృష్ణ పరమహంస పలికిన పలుకొక్కటి ఆదరణీయము. ఒక రూపాయిని పరిశీలించుకొని గ్రహించుట యెట్టిదో గురువును గ్రహించుటకుకూడ నట్టిదేననెను.

తత్త్వోపదేష్టయగువాడు వేదోక్త సంప్రదాయములకు దూరుడై ఉండకూడదు. వర్ణాశ్రమాచారములను తన యథాశక్తిగ నాచరించు వాడై యుండవలెను. భారతీయ సంప్రదాయములకు దూరుడై ఆత్మ జ్ఞానమునకు వేషభాష లక్కరలేదని వర్ణసంకరుడై జిహ్వోపస్థల నరికట్టలేని పండితమ్మన్యుడు గురువగుట శిష్యుని దురదృష్టము. తత్త్వశాస్త్రము ముముక్షువునకెట్టి అధికారమును నిర్ణయించినదో గురువునకుకూడ అట్లే అధికారమును వర్ణించినది. ముందు శ్రుతి మాత పలుకులను చెప్పి గీతావాణిని వినిపింతును. "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" వేదోక్త సంప్రదాయము కలిగి తత్త్వనిష్ఠుడు కావలెనట.

వి - గీత ?

కృ - మొదటినాటి నాందీ శ్లోకము గుర్తున్నదా ?

వి - చిత్తము.

కృ - ఆ శ్లోకముననే గురుస్వరూపమును, గురువరణ విధానమును గురు వుల నడుగదగు ప్రశ్నయు వర్ణించబడియున్నవి. గురువుయొక్క అర్హతను "జ్ఞానిన స్తత్త్వదర్శినః" అని వర్ణించినది గీత. గురువు జ్ఞానియు, తత్త్వదర్శియుకూడ కావలెను. "జ్ఞానినః, తత్త్వదర్శినః" ఆత్మతత్త్వము నుపదేశింపదగు శాస్త్రపరిచయ మున్నంతమాత్రమున చాలదు. ఆత్మానుభవముకూడ కలవాడు కావలెను. పరోక్ష అపరోక్ష జ్ఞానములు రెండును అవసరము. అట్టి మహనీయులు స్వేచ్ఛావారులుగా నుందరు.

వి - ఒక్క సందేహము. ఆత్మ సాక్షాత్కారమైన జ్ఞానులకు ఆచార నియమము లక్కరలేదనియు, వారు శాస్త్రనిబంధనలకు కట్టుబడి యుండ నక్కరలేదనియు, వారేమి తప్పులొనరించినను వారికంటి వనియు శాస్త్రనిబంధనలన్నియు అజ్ఞానులకే ననియు, కొందరు సిద్ధాంతములు చేయుదురే ? ఆ విషయమున తమ అభిప్రాయ మేమి ?

కృ - తమ అభిప్రాయమేమి? అని అడుగు ప్రశ్న తప్పు. శాస్త్ర మేమను చున్నది? అని ప్రశ్నించుము.

వి - చిత్తము.

కృ - ఈ విషయమున విద్యారణ్యు లొకమాటను చెప్పిరి.

శ్లో॥ బుద్ధాఽద్వైత స్వతత్త్వస్య యథేష్టా చరణం యది.
శునాం తత్త్వదృశాం చైవ కో భేదోఽశుచిభక్షణే॥

ఆత్మతత్త్వమును చక్కగా గుర్తెరిగిన జ్ఞాని విషయముల నరికట్టక యథేష్టా చరణుడైన యెడల అతనికిని కుక్కకును భేద మేమియు లేదని నిర్ణయించిరి. అంతకంటె చెప్పవలసినదేమున్నది? కావున ఆ సిద్ధాంతము తప్పు. అసలు జ్ఞానియగు వాని యింద్రియములు దోషముపై పోకు మరలునా? జ్ఞానియైన వాడు నిషిద్ధ పదార్థభక్షణము చేయవచ్చునని వేదాంత శాస్త్రము చెప్పలేదు. మాకు ఆత్మదర్శన మైనదని విషయలోలురగు గురువుల కడకు పోరాదు.

వి - కొందరు నిజమగు జిజ్ఞాసువులు గురువులను వెతుకనక్కర లేదనియు గురువులే జిజ్ఞాసువు దగ్గర కొత్తురనియు అందురే ?

కృ - అ విషయము జిజ్ఞాసువుయొక్క పూర్వపుణ్య వైభవముపై నాధార పడియుండును. పరీక్షన్నరేంద్రునివద్దకు శుకులే వచ్చిరి. శుకులు జనక మహారాజు వద్దకు వెళ్ళినట్లున్నది.

గురుపీఠములు నేడెన్నియో వెలసినవి. గృహదీపములవంటి గురువు లెందరైన దొరకుదురు. కాని సూర్యుని వంటి వారెక్కడ నుందురో! వారు చాల దుర్లభులు.

శ్లో॥ గురవో బహవస్సంతి వేదశాస్త్రార్థ పారగాః
దుర్లభోయం గురుర్దేవి పరతత్త్వార్థపారగః॥

వేదశాస్త్రములు వల్లించుటయే గురుత్వమున కర్హతకాదు. శిష్యునకు తత్త్వము నందించదగు సమర్థులు కావలెను.

సాందీపులొక్కరే శ్రీకృష్ణునకు గురువులైరి. పరబ్రహ్మాను సంధానమున బాహ్యప్రపంచమును మరచిన శుకులు పరీక్షన్న రేంద్రునకు మోక్షమొసంగిరి. వారు స్వేచ్ఛాచారులు కారు. కాబట్టి

గురువులను పరిగ్రహించుటలో కూడ శాస్త్రమును వెలుగును గ్రహించవలెను.

వి - ఇక గురువులవద్దకు శిష్యుడు వెళ్ళవలసిన పద్ధతిని, వెళ్ళి అడుగ దగిన విషయములను, అడుగునట్టి పద్ధతిని గురించియు తెలియ జేయవలెనని ప్రార్థన.

కృ - ముందు గురువుల వద్దకు వెళ్ళతగిన విధానమును శ్రుతి యిట్లు చెప్పినది? 'సమిత్పాణిః' అని. అనగా చేత సమిధలను పట్టుకొని గురువులను సమీపించవలెను. రిక్తహస్తములతో గురువులవద్దకు వెళ్ళరాదు. సమిధను చెప్పుటచేత ఫలపుష్పాదులను గ్రహించ వచ్చును. గురువును సమీపించిన తరువాత విషయమును గీతాశాస్త్ర మీ విధముగా వర్ణించినది.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా॥

గురువులను సమీపించగనే ప్రణిపాతములు గావించవలెను. ప్రణి పాతమనగా "ప్రకర్షేణ నీచైః పతనం ప్రణిపాతః" కర్రవలె చక్కగా సాగిలబడి చేయు వందనమునకు ప్రణిపాతమని పేరు సాష్టాంగ వందనమన్నమాట. అలా నమస్కరించి సవినయముగా పరిప్రశ్నను వేయవలెను. పరిప్రశ్నయనగా తన సంశయముల నన్నిటిని సమగ్రముగా అడిగి తెలిసికొనుట.

"బహువిషయేణప్రశ్నేన" ఆ ప్రశ్నఫలమును పొందుటకు కేవల నమస్కార మాత్రముచాలదు. అందుకని "సేవయా" శుశ్రూష కూడ చాలా అవసరము. "కాలే కాలే శ్రద్ధాభక్తిభ్యాం క్రియమాణ శుశ్రూషయా. శంకరానందీ." ఆశుశ్రూష నాలుగు విధములు. స్థాన శుశ్రూష, అంగశుశ్రూష, భావశుశ్రూష, ఆత్మశుశ్రూష. గురు

వర్యుని గృహ ఆరామక్షేత్రాదులను రక్షించుట స్థానశుశ్రూష. ఆ గురువర్యులకు శరీరసంస్కారములను అనగా స్నానపాద సంవాహనాదులను గావించుట అంగశుశ్రూష. ఈ రెంటికిని అమూల్యాలంకారమును కలిగించునది భావశుశ్రూష. ఈ శుశ్రూష యందు వేరొక దైవములేదు. గురువే దైవమై తన యెదుట సాక్షాత్కరించును. లోకమునందే వస్తువు ప్రత్యక్షము కావలె నన్నను ఆ వస్తువును కోరువాని మనస్సు ఆవస్త్వాకారము నొందిన నే ఆ వస్తువును చూడగలుగును. చూడగలుగుటయేకాదు. ఆ వస్తువువలన కలుగు తృప్తియును అప్పుడే కలుగును. మనస్సు విషయాకారము నొందనప్పుడు ప్రపంచమునందు విషయమున్నను ఇంద్రియగోచరముకాదు. అట్లే గురుమూర్తిని కూడ పరమాత్మ నుగా భావించునో అతడు పరమాత్మయగుటకు సందేహములేదు.

గురువుయొక్క స్థూల శరీరమును చూచుటవలదు. గురువును పరబ్రహ్మాత్మగా చూచుట అవసరము. గురుమూర్తిని తనకును వాటులేని అంతఃకరణ మున్నప్పుడే గురువులు బ్రహ్మవిద్యను నిష్కాపట్యముగ బోధింతురు. గురుశిష్యులిద్దరును వామలేని మిత్రులు. శ్రీకృష్ణుని వాక్యమిది.

"భక్తోసి మే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమం"

అ. 4. శ్లో. 3.

అర్జునా! నీవు కేవల భక్తుడవేకాదు. సఖుడవుకూడ. అందుచే యీ రహస్యమును చెప్పుచున్నానెను. జ్ఞాన రహస్యమును చెప్పు అర్హత కలిగినదని అర్థము. ఇక్కడ శంకరానందులు చక్కగా వ్యాఖ్యానించిరి.

సఖావాపి స్నిగ్ధః సఖ్యుః, స్మరణశ్రవణాదిభిః ద్రవీభూయ
మానచిత్తః॥

గురుమూర్తి తన స్మృతిపథమునకు వచ్చిన మాత్రముననే లేక వారినిగురించి వాక్యములు వినబడిన మాత్రముననే ఎవని హృదయము ద్రవించి గగుర్పాటునొంది ఆనంద బాష్పముల రాల్చునో అట్టి హృదయము సఖ్యముగలది. కావుననే వ్యాఖాత "స్నిగ్ధః" అని వాడిరి.

కావున భావశుశ్రూషయందు వేరొక దైవములేదు. శిష్యుని భావమానసమున ఏకాకారమై వెలుగునట్టి చైతన్యమూర్తి యీ గురువర్యులే.

"అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః॥"

అను గురునమస్కారమంత్రము ఈతని ఉచ్ఛ్వాస నిశ్వాసములలో తిరుగుచుండును. తల్లియు, తండ్రియు, బంధువును, ఈ గురువులే. వేయేల? తా నభ్యసించు విద్యయు ఈ గురుపద్మనిరూపమే, అను నట్టి దృష్టి భావశుశ్రూష యందుండును. చతుర్విధ శుశ్రూషల యందును స్థానశుశ్రూష కొరకు చక్కని కథ ఉన్నది.

ధౌమ్యుడను మహర్షికి ముప్పాది శిష్యులు. అందు అరుణి ఒకడు. ఒకప్పుడు ఆరుణియను శిష్యుని పరీక్షింపదలచిన గురువర్యులు తన పంటభూమికి పంపి, పంటకాలువ నుండి పొర్లిపారలే నీరును చేనుపై బడకుండ చేయుమని ఆజ్ఞాపించెను. ఆరుణి ఆక్షేత్రము నకు వెళ్ళి గురువుల ఆజ్ఞానుసారము ఆ ప్రవాహమునకు కట్టకట్ట నారంభించెను. కాని ఆగినట్లు ఆగలేదు. గురువుల క్షేత్రము పాడ

గుడు కావున నేనే ఈ ప్రవాహమున కడ్డముగ నుండెదనని ఆ ప్రవాహమున కడ్డముగ పరుండెను. అంతతో ఆ ప్రవాహవేగము తగ్గినది. అట్లు రెండు మూడు రోజులు గడచినవి. ఆరుణి ఇంటికి రాలేదు. ధౌమ్యులు మిగిలిన శిష్యులను ప్రశ్నించగా ఆరుణి తమ పొలమునందే యుండెనని చెప్పిరి.

మిగిలిన శిష్యులను వెంట నిడుకొని పంటభూమికి వెళ్ళి ఆరుణీ! అనిపిలచెను. అ నీటిప్రవాహమునుండియే తన యుదంతమునంతను గురువులకు విన్నవించెను. ప్రవాహమునకట్టి వేగమును కల్పించి నది గురువులే. అందుచేతనే గురువులకు ఆతడు గావించిన త్యాగముఆనందజనకమైనది. గురుభక్తి పరీక్షయందు తీర్ణుడయ్యెను. వెంటనే గురువులు శిష్యుని పిలచి ఆతనికి సమస్త వేదశాస్త్ర పురాణేతిహాసములను పరహస్యములుగా బోధించునట్లనుగ్రహించిరి. ఆతడే ఉపనిషత్తులలో వర్ణితుడైన ఉద్దాలకుడు. గురుశుశ్రూషయే సమస్త విద్యలకును మూలమనియు, అందు స్థాన శుశ్రూషయవ ఇదియనియు ఈకథ చెప్పుచున్నది. ఇది భారతములోని కథ. శ్రీకృష్ణుడు సాందీపునివద్ద గావించిన శుశ్రూష గురుపత్న్యులకు కావలసిన పదార్థముల సంపాదించుటలోగల విశేషమును చెప్పును. ఇదీ ఆత్మ శుశ్రూష.

వి - ఇక దైవభక్తి అక్కరలేదా ?

కృ - తప్పు. తప్పు. దైవభక్తి అక్కరలేదనికాదు. దైవమును గురువును ఒక్క విధముగా చూడవలెననిభావము. శ్రీకృష్ణుని సందేశము విను.

"మయిచానన్య యోగేన భక్తిర వ్యభిచారిణీ॥" 13—10

భగవంతుడనైన నాయందు బుద్ధిని దృఢముచేసి అచంచలమగు భక్తిని కలిగియుండవలయుననియే జ్ఞాన సామాగ్రిని వర్ణించిరి.

"నాన్యో భగవతః వాసుదేవా త్పరః అస్తి అతః సఏవనో గతిః ఇత్యేవం నిశ్చితా అవ్యభిచారిణీబుద్ధిః. శం.భా.

అచంచలమగు భక్తియను నారాయణునికంటె నాకు వేరొకగతి లేదనునట్టి నిర్ణయబుద్ధిగలవానికే ఆత్మజ్ఞానోదయము.

నవిద్యతే పరమేశ్వరాదన్యః శరణం మమ ఇత్యేవం నిశ్చలి లక్షణత్వం అనన్యః. శంకరానందీ.

భగవద్భక్తిలేని జ్ఞానసాధనలు ఫలించవు. గీతాశాస్త్రములోని జ్ఞాన సాధనల నన్నిటిని నొక్కుమాటగ చెప్పిన ఒక మహాకవి వర్ణన మిచ్చట స్మరణీయము.

చ. హరిపదపద్మయుగ్మమున నంచితభక్తి మనంబులో జరా
మరణభయంబు బాంధవ సమాజముపై స్పృహ లేమి దుస్పృహ
స్మరశరనిగ్రహంబు మునిమాన్యవివిక్త పవిత్రదేశముల్
పరమవిరక్తియుం గలుగ భాగ్యమహోన్నతి పేరుకున్నదే.

౧ - చిత్తము. తరువాత సెలవీయుడు.

౨ - తరువాతది పరిప్రశ్న. పరిప్రశ్నయనగా తనకు కావలసిన విషయమును చక్కగా బోధపడువరకును సవివరముగ నడిగి తెలుసుకొనుట. ఆ విషయమున సందేహముతీరి నిశ్చయజ్ఞానము కలుగు నంతవరకును అడిగి తెలుసుకొనుటకే పరిప్రశ్న యనిపేరు. గురువులను, పెద్దలను ఏ విషయమడిగినను వక్రముగా మాత్రము ప్రశ్నించకూడదు.

వి - వక్రముగా ప్రశ్నించుట యనగానేమి ?

కృ - ఒక విషయమును గురించి ప్రశ్నించుట రెండువిధములు. జయేచ్ఛచే ప్రశ్నించుట. (చెప్పువానిని ఓడించుటకు) జిజ్ఞాసతో ప్రశ్నించుట. జయేచ్ఛతో ప్రశ్నించుటకు వక్రమని పేరు.

వి - ఆ ప్రశ్నలను గుర్తించుట ఎట్లు ?

కృ - జయేచ్ఛతో ప్రశ్నించు వ్యక్తి యథార్థమగు తన హృదయమును బయటకు రానీయక కప్పిబుచ్చి, రూపాంతరమున సందేహమను పేరుతో ప్రశ్నించును. జిజ్ఞాసు వట్టికాదు. జిజ్ఞాసువనగా తెలుసుకొనగోరువాడు. అతనికి కలిగిన సందేహమును వివరించి, తన హృదయమునుకూడ ప్రకటించును. తాను భావించిన దానియందలి గుణదోషములను తెలుప ప్రార్థించును. సంశయమనగా రెండవ వానిది. కారణమేమన ? సంశయ మన రెండభిప్రాయములు కలిగయుండుట. సంశయమున కొక్కటియే ప్రశ్నకాదు. ఒకడు చీకటిలో నొక యెత్తయిన స్తంభమును చూచును ఆ స్తంభమున కిరుప్రై పుల భుజములుకూడ కనుపడుచుండును. చేతులు వ్రేలాడుచుండునట్లుండును.

కనుక అది మనుష్యుడనియు, అదీ కదలుటలేదు, నడచుటలేదు గనుక స్తంభమనియు భావించవచ్చును. ఈ రెండు భావములందును యే ఒక్క భావము విశ్చయమైయున్నను అదీ సంశయముకాదు. నిశ్చయ జ్ఞానమేయగును ఆ రాతిని పురుషుడని నిశ్చయించిన భ్రాంతి, శిలయనుకొన్న యథార్థజ్ఞానము. ఆ రెండు జ్ఞానములను కలిగియున్న సంశయము. సంశయించినవాడు తాను భావించిన రెండు భావములను చక్కగా విశదపరచి నాకీ సంశయ

మును తీర్చి నిశ్చయ జ్ఞానము నందింపుడని ప్రార్థించవలెను. తను గ్రహించిన దానిని చెప్పక దానిని గురించి మీ అభిప్రాయమేమి? అన్నచో జవాబిచ్చరని గ్రహించవలెను.

వి - అసలు జిజ్ఞాసయను పదమునకు అర్థమేమందురు? జ్ఞాతు మిచ్ఛా జిజ్ఞాసా. తనకొక సందేహము కలుగగా దానిని సాంగోపాంగముగా తెలుసుకొను ఇచ్ఛకు జిజ్ఞాసయని పేరు. గురువర్యులవద్దకు వెళ్ళి తనకు తెలిసిన విషయము ముందుచెప్పి, తన సందేహమును వివరించవలెననికదా మీరు చెప్పితిరి.

ఇందుకొక్క ఉదాహరణను ప్రసాదించవలె.

కృ - భాగవతమున బ్రహ్మ నారద సంవాదము చక్కని ఉదాహరణము! నారదమహర్షి బ్రహ్మను ప్రశ్నించును. నారదునకీ సృష్టి కారణమును గురించి సందేహముకలిగినది. ఈ సృష్టికర్త యెవరు? ఈ సృష్టిని నాతండ్రియైన చతుర్ముఖ బ్రహ్మయే చేయుచున్నటుల కనబడుచున్నది. నిజమున కాయనయే యీ సృష్టికి ప్రభువై యీ సృష్టిని సాగించుచుండెనా? లేక ఎవరి యాజ్ఞనైనా పురస్కరించుకొని చేయుచుండెనా? నా తండ్రియే ప్రభువై యున్నచో ఏవిధమగు ప్రయోజనము నపేక్షించి చేయుచుండెను? అంతియే కాదు. ఈ సృష్టికి నా తండ్రియే ప్రభువగుచో నాతండ్రి తపస్సుచేయుట చూచుచుంటిని. మరి ఎవరిని గురించి చేయును? తనకంటె మహోన్నతుడెవ్వరో యుండినగదా? తపస్సుచేయుట? నా సందేహమును నా తండ్రియొద్దనే బాపుకొందును అని చతుర్ముఖుని సమీపించి యిట్లు ప్రశ్నించెను.

మ. చతురాస్యుండవు వేల్పుపెద్దవు జగత్స్రష్టవు పంధాయి వే
ద్రుతిసంఘాతము నీముఖాంబుజముల౯ శోభిల్లుశబ్దార్థ సం
యుత మై సర్వము నీ కరామలకమై యుండుంగదా భారతీ
పతి యిల్లాలట నీకు నోజనక నా సందేహముం బాపవే.

అని ముందు తాను ఎవరివలన యీ విజ్ఞానమును తెలుసుకొనదలం చెనో ఆయానకుండు అర్హతను వర్ణించి అర్థించినాడు. ఇది జిజ్ఞాసు ప్రశ్నకు ప్రాతిపదిక. తరువాతది ప్రశ్న.

శా. ప్రారంభించుటకేక మెప్పుడౌనగుం బ్రారంభ సంపత్తి కా
ధారం బెయ్యది యేమిహేతువు దుపర్థం బేస్వరూపంబు సం
సారాన్మకము మూర్ణనాభిపగిదిం జాగించె నొక్కప్పుడుం
బారం బెన్నడు లేదు నీమనువు దుష్ప్రాపంబు వాణీశ్వరా.

ఊర్ణనాభియనగా సాలీడు. ఆ సాలీడు గూడుకట్టినట్లున్నది యీ సృష్టి. ఈ సృష్టికి అంతులేదు. ఈ సృష్టి జ్ఞానమును మీకెవరు అందించుచుండిరి? ఈ సృష్టికి కావలసిన పదార్థ సంచయమెక్కడ నుండి వచ్చుచున్నది? అని ప్రశ్న. తరువాత.

శా. నాకుం జూడగ నీవు రాజ వను చున్నాడన్ యథార్థస్థితిన్
నీకంటెన్ ఘను డొక్కరాజు గలడో నీ వంతకున్ రాజవో
నీ కేలాభము రా దలంచి జగముల్ నిర్మించె దీచేతనా
నీకం బెందు జనించు నందు వడగున్ నిక్కంబు భాషింపుమా

నీకంటె గొప్పవాడొక డుండెనా? నీకంటె వేరొకరు లేరని నా తలంపు. ఈ సృష్టి దేనిని ఆధారము చేసికొని బహిర్గతమగు చున్నది.

ఈ సృష్టి నిలుచుటకు ఆధారమేద్ది? ఇదీ దేనియందు లయమగు చున్నది? ఈ కర్తవ్యము నెరవేర్చుకున్నచో విన్నైవ్వరైన శిక్షింతురా? ఈ సృష్టి కర్తృత్వమున నీకేమి లాభము వచ్చును? ఆ లాభము విచ్చువాడెవరు ?

అట్టి మహనీయు డొకడున్నచో వానిని గురించి వర్ణించుట సాధ్య మగునా? సృష్టి కారణమగు మహ త్తత్వము వాక్కులకందరానిదని వింటిని. చెప్పదగినదగుచో నాకు చెప్పవలసినదిగా నా ప్రార్థన యని యడిగెను.

శా. అంభోజాసన నీకు నీచకు గళం డం చేని దత్పక్షమం
దంభోజాతభవాండ మేవిభునిలీలాపాంగ సంభ్రాంతిచే
సంభూతం బగు వర్తమాన మగు నంపన్నం బగుం దద్విభున్
సంభాషింపగ వచ్చునే దలప నేచందంబువా డాకృతిన్.

నారదమునీంద్రుని ప్రశ్నయందొక ప్రత్యేకత యున్నది.

క. తోయజ సంభవ నాకీ తోయము
వివరింపు చాల దోచిన నే నా
తోయమువారికి నన్యుల తోయములం
జేరకుండ ధ్రువమెరిగింతున్.

జిజ్ఞాసు ప్రశ్న అర్థమైనదా?

వి - చిత్తము. విశదముగా తెలిసినది.

కృ - పార్థుని ప్రశ్న.

"కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ
సంమూఢచేతాః
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేహం శాధి మాం
త్వాం ప్రపన్నం॥

కృష్ణా! నా బుద్ధి సమ్మూఢమైనది. నాకు గలుగదగు శ్రేయస్సును మీరే నిర్ణయింపుడు. నేను మీ శిష్యుడను. ప్రసన్నుడనై కాళ్ళపై బడితిని. నన్ను శాసింపుడు అని ప్రశ్నించెను. తనకంటె గురువు సర్వజ్ఞుడని భావించుటేకాక యింతకంటే వేరొకరు నన్ను తరింప జేయువారు లేరను విశ్వాసముకూడ శిష్యునకు కలుగవలెను.

పరీక్షన్నరేంద్రుని గురువరణమును గూడ పరికింపుము.

మ. అవధూతో త్తమ మీటినేడు నిను డాయంగంటి నీవంటివి
ప్రవరుం జేర్కొను నంతటన్ భసితమౌ పాపంబు నా బోటికిన్
భవదాలోకన భాషణార్చన పదప్రక్షాళన స్పర్శనా
ది విధానంబుల ము క్తిచేపడుట చింతింపగ నాశ్చర్యమే.

వి - తమ పాదములను ఆశ్రయించిన యీ జిజ్ఞాసువు యొక్క గురువరణమును అట్టిదే అని యీ క్రింది శ్లోకమును పఠించెను.

"కథం తరేయం భవసింధు మేతం
కా వా గతి ర్మే కతమో స్త్యుపాయః
జానే న కించి త్కృపయావ మాం ప్రభో
సంసారదుఃఖ క్షతిమాతనుష్వ"

విజయుని ప్రశ్నలివి. నేనీ సంసార సముద్రము నెట్లు దాటుదును? నాతరణమున కుపాయమును వచింపుడు. గురువర్యా! మీరు దయా-

సముద్రులా. నా దుఃఖమునకు క్షతిని కల్పించువారిక మెవ్వరును లేరని పాదములపై బ్రాలెను.

కృష్ణానందులకు దయ కలిగినది.

శ్లో. మాభైష్ట విద్వం స్తవ నాస్త్యపాయః
సంసారసింధో స్తరణే స్త్యుపాయః
యేనైవ యాతా యతయో స్యపారం
తమేవ మార్గం తవనిర్దిశామి.

విజయా! భయపడకుము. సంసార సముద్రమును దాటు నుపాయము లేకపోలేదు. మహనీయులైన పరమహంస లందరును ఏ మార్గము ననుసరించితరించిరో ఆ మార్గమునే నీకును నిర్దేశించెదనని కృష్ణానందు లభయదాన మిచ్చిరి.

మూడవరోజు గోష్ఠి ముగిసినది.

- శ్లో అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాం జనశలా కయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥

అని నమస్కరించి ఓం తత్సత్ అని శాంతిని చెప్పెను.

# గీతా హృదయము

## -: ఉపదేశము :-

"కర్మణ్యకర్మ యః పశ్యేద కర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్న కర్మ కృత్"

భారతీయ తత్వశాస్త్రము మానవ సమాజమును తిలకించి యా మానవ సమాజమున కొందరిని మాత్రమే బుద్ధిమంతులని నిర్ణయించినది.

మానవ సమాజమంతయు బుద్ధివైశద్యము కలదీ కాదా? అన్న ప్రశ్నకు సృష్టి క్రమమునే తారుమారుచేసి చెప్పినది. మానవులు సహజముగా చూచి తెలుసుకొనునది యథార్థ ప్రపంచము కాదన్నది. యథార్థమును గ్రహించగలిగిన చూపు ప్రకృతి నిర్మించిన నేత్ర గోళములలో లేదని నిర్ణయించినది మానవుడు తన కెదురైయున్న దానిని మాత్రమే చూచుచున్నాడు. తన చూపును తన వైపుకు త్రిప్పుకొని చూచుటలేదు అని మానవుని సంబోధించి మానవుడా! నీకభిముఖమై వెలుగొందు ప్రపంచమంతయు అబద్ధము. నిత్య సత్యమై వెలుగొందు వస్తువు నీ కంటికి కనబడదు. నీకంటికి కనబడునదేదో నీ యూహకు అందునదేదో అది సత్యమే కాదు. అది కల. మరి సత్యవస్తువేది? అందువా? చూచు నీవొక్కడవే సత్యము అని సర్వవేదేతిహాస పురాణ కావ్య వాఙ్మయముల నన్నిటిని ఏకముఖముగా నన్వయించి జగద్గురువుల ముఖముగా వెలువరించినది.

ప్రకృతి ప్రవాహమున కెదురై పలుకు నా జగద్గురువుల పలుకులను మానవ సమాజమంతయు విశ్వసించునా?. మానవుని యందొక ప్రత్యేక

మగు నహంకారమున్నది? మానవసంఘము రాక పూర్వము తత్త్వశాస్త్ర మెక్కడిది? తత్త్వశాస్త్రమును నిర్మించుకొన్నది మానవ సంఘమే అను ప్రకృతివాదులుకూడ బ్రహ్మసృష్టిలోనివారే. వారే ఖండమువారై నను గావచ్చును. ఆ సంఘము భారతీయ తత్త్వశాస్త్రముల వంకకు తిరిగి, భారతీయ తత్త్వశాస్త్రమా! నా కంటికి అగపడునదంతయు మిథ్యయేనందువా? నావి నేత్రములు కావందువా? నాచే నిత్యమును చూడబడు ఈ ప్రకృతియే నా పరిశీలనమున తత్త్వ శాస్త్రమను దానిని నాకందించినది. నేనే నా తోటి మానవులకు నిన్ను బోధించితిని. అట్టి నన్ను భ్రాంతిశాలినిగా నిర్ణయించుచున్నావు. ముందువచ్చిన చెవుల కంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడియన్నట్లున్నది నీ మాటల సొబగు. అనుచు నుపన్యసించు మానవునకు భారతీయ ఉపనిషత్సారస్వతము దయతో సమాధానము చెప్పుచున్నదీ, బోధించుచున్నది.

మానవుడా! మోసపోవుచున్నావు. నిన్ను నీవే మరచి మాటలను మాట్లాడుచున్నావు. నీ వీపును నీవు చూడజాలవు. నీకు కనబడు విశ్వమే నిన్ను మరపించుచున్నది. పగలు నీకభిముఖమై కనబడు యీ విశ్వము నీ నిద్రలో మటుమాయమగుచున్నది. మరల వచ్చుచున్నదీ. విశ్వమా! నా నిద్రలో నీవెక్కడి కేగుచుంటివి? అన్న ప్రశ్నకు విశ్వము నీకు సమాధానము చెప్పుటలేదు. చెప్పుటకు సమర్థముకూడ కాదు. ఓ భౌతికవాదీ! నీవొక నదీ ప్రవాహమున ప్రయాణముచేయు పడవనెక్కి ఆ నదియొడ్డునందున్న చెట్లను చూడుము. అవి వెనుకకు పరుగెత్తుచున్నట్లు కనబడును. అప్పుడు నీకన్నులే నిన్ను మోసగించినవి చూచితివా? ప్రకృతి స్వభావమట్టిది. అప్పుడు నీ చూపును రెండవ వైపుకు మరలింపవలసివచ్చును. అదీ బుద్ధి, బుద్ధికి మాత్రము తక్కువ తనము లేదా? లేకున్న బుద్ధి

తక్కువపనులన్న మూక్తి యెక్కడిది ? బుద్ధియు యీ విశ్వమును గురించి నీకు నిజముచెప్పదు. ఈ విశ్వమునకు పూర్వమున్నది నీ బుద్ధి వైశద్యము కాదు. విశ్వములోని యొక భాగయే నీ బుద్ధి వైశద్యము. బుద్ధిని నీ అహంకారము ఆవరించినది. ఆ అహంకారము నీకంటికి కానరాదు. అహంకారమునకు భౌతికకాయము లేదు. దాని శరీరము సంకల్పరూపము. ఆ అహంకారము నీ యెదుట ఆత్మాభిమాన మన్నపేరున విలయ తాండవము చేయుచున్నది. ఆ అహంకారమొక మాయా చూర్ణమును చేతియం దుంచుకొన్నది. ఆ పొడినే ప్రతి మానవుని పైనను చల్లుచున్నది. పండితుల మనుకొన్నవారిని సైతము వారు పెట్టుకున్న ఆ పేరువనే రూపమునొంది ఆ పండితులను కూడ తనపొట్టన పెట్టుకొనుచున్నది. ఆ ఆహంకారావరణము నీ నిజరూపమును మరపించినది. యథార్థమగు జ్ఞాననేత్రమును మూయించినది. భారతీయ వాఙ్మయమును చూడవద్దన్నది. ఒకవేళ చూచినను అహంకారమునైన నా నేత్రమున చూడమన్నది. కావున నీవు నన్ను చూచునది అహంకారముతోడనే. నీకు నేనెట్లు అర్థమగుదును? అయ్యును నిన్ను ప్రబోధింపదలచితిని. భగవంతుడు నన్ను భారతక్షేత్రమున సృష్టించినాడు. తన కృపాపీయూషమున నన్ను తడపినాడు. నాకుపనిషద్వాణి యని పేరు పెట్టినాడు. నేను మానవనిర్మితమైన శబ్దజాలమునుకాను. మానవాతీతమై శాశ్వతానందము నొసంగు మహోన్నత విజ్ఞానమును మానవుని కందింపవచ్చిన భారతిని. అమరవాణిని. ఓ భౌతికవాదీ ! నీ చెవిని నా వైపుకు త్రిప్పుము. నీ బుద్ధిని కూడ నాలోననే ప్రవేశపెట్టుము. నీ అహంకారము లేదా నీ బుద్ధి వైశద్యములోని భౌతిక సారస్వతము నిన్నొక అద్దాలమేడ నెక్కించినది. ఆ మేడలోనే నీ జీవితము గడపునట్లు

చేసినది. ఆ మేడయందమర్చబడిన ప్రతి అద్దమునందున కనబడుచున్నట్టివి నీ ప్రతిబింబములేమైనను, ఆ ప్రతిబింబము లెన్నియో అందరు నీకంటె వేరు వ్యక్తులుండిరని నిన్ను నమ్మించినది. యథార్థమునకు ఆ మేడలో వేరొకరు లేరు. నీ ప్రతిబింబములే. ఆ వ్యక్తుల ఆకృతులు వేరుకావచ్చును. ఒకే ఒక బింబమును అనేకములుగా కనబడునట్లు చేయు మాయా చూర్ణమును ఆ అహంకారము చేతియందుంచుకొన్నది గదా ? మడుగునందు ప్రతిబింబించు చంద్రబింబము ఆ మడుగునందలి తరంగము లెన్నియో అన్ని ప్రతిబింబములగును. ఆ విషయము నెవ్వడు గుర్తించగలడు? అహంకారమును వదలి వినమ్రుడై నన్ను సమీపించినవానికి నేను బోధపరతును. నీ అహమునకు అవ్వల నీవుండియు ప్రకృతి సృష్టించిన అహము నేనేనని భ్రమించుచున్నావు. కావుననే యీ ప్రకృతియంతయు నీకంటె భిన్నమై అయథార్థ జ్ఞానమునే నీ కందించుచున్నది. అందుకే ఆ ప్రకృతి ప్రతిబింబములను నీవు ద్వేషించుటయో, ప్రేమించుటయో, మోహించుటయో చేయుచుంటివి. నీ కభిముఖమై నిన్ను వంచించిన ఆ అహమునకు చాల పేర్లున్నవి. దానిని అజ్ఞానము, అహము, ప్రకృతి, లేక అవిద్య, మాయ, మనస్సు, బుద్ధి, జీవుడు అను పేర్లన్నియు ఒక్కదానినే చెప్పును. నీవు బుద్ధిమంతుడవు కావలెనన్న ముందు నీ వెవ్వడవో గుర్తెరుగవలెనని ప్రబోధించినది.

పాఠకులారా! నేనెవ్వడనన్న ప్రశ్నకు సమాధానమే యీ ఉపదేశ ప్రకరణము.

మన గీతాగోష్ఠికిది నాల్గవరోజు. ఉపదేశ పీఠమును కృష్ణానందులును, వారి పాదపీఠమును విజయుడును ఒకరికొకరు అమూల్యాలంకారములుగా గోష్ఠిపీఠముల నలంకరించిరి.

విజయుని అభివాదన గీతమిది.

శ్లో॥ యస్యైవస్ఫురణం సదాత్మక మసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్
యత్సాక్షాత్కరణాద్భవే న్నపునరావృత్తిర్భవాం భోనిధౌ
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

విజయుని దృష్టి గురువుల పాదసరోజములను వదలి వారి ముఖ మండలము మీదికి పయనించినది. విజయుని చూపులో ఆర్తియు, గురువుల చూపులో ప్రసన్నతయు ఆత్మవిద్యాప్రబోధమునందలి ప్రాచీన సంప్రదాయమును ప్రకటించగా వారి గోష్ఠి ప్రారంభమైనది.

వి - స్వామీ ! నిన్న తాము సెలవిచ్చినట్లు సంసారభయమును తొలగించు పరమహంసల మార్గమును సెలవిత్తురా ?

కృ - గీతాశాస్త్రమున 4వ అధ్యాయమున 18వ శ్లోకార్థమును భావించుటయే పరమహంసల మార్గము. ఆ శ్లోకార్థము అనుభవమునకు వచ్చుటయే సంసారమునుండి తరించుట.

వి - శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యే దకర్మణి చ కర్మయః
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్. 4.18

ఈ శ్లోకమే గదా ?

కృ - అవును.

వి - ఇది చాల తికమకగానున్నదే ?

కృ - అర్థము కాలేదా ?

వి - అర్థమైనది. ఎవడు కర్మయందకర్మను, అకర్మయందు కర్మను చూచునో అతడు మనుష్యులయందు బుద్ధిమంతుడు, యుక్తుడు, అన్ని కర్మలను చేసినవాడు నగును అని అర్థమైనది.

కృ - నీకీ శ్లోకమున తికమక యెక్కడ ?

వి - కర్మయందకర్మను చూచుట, అకర్మయందు కర్మను చూచుట అనునది నాకు తికమకగా నున్నది. ఈ దృష్టి విపరీతముగదా ?

కృ - అసలు కర్మ, అకర్మ అను శబ్దములకు అర్థము తెలిసినదా ?

వి - కర్మయనగా క్రియ. ఏపనినైనను చేయుటకు కర్మయని పేరు. ఏ పనిని చేయకుండుటకు అకర్మయని పేరు.

కృ - గీతాశాస్త్రము మానవుని విపరీత దృష్టిని తొలగించుట కవతరించినదా ? లేక విపరీతదృష్టిని కల్పించుట కవతరించినదా ?

వి - మానవుని విపరీత దృష్టిని తొలగించుటకే శాస్త్రము పుట్టినది. తాము మొట్టమొదటినుండియు నాహృదయ క్షేత్రమున నాటిన బీజమదియే.

కృ - మరి యీ శ్లోకమున శ్రీకృష్ణుడు విపరీత దర్శనము నెట్లు చెప్పును. మిథ్యాదృష్టి కలిగియున్న మానవునకు సత్యదృష్టినే బోధించియుండును.

వి - ఆ సత్యదృష్టి నెరుగక పోవుటయే తికమకయైనది. తమరీ దీనునకు ఆ సత్యదృష్టిని ప్రసాదింపుడనియే నా ప్రార్థన. తమవంటి మహాత్ములీ శ్లోక గ్రంథులను విప్పకున్న ఆత్మజిజ్ఞాసువుల కాధారమేలేదు. శంకరాది సద్గురువులందరును సంసార తాపతప్తులగు వారల నుద్ధరించుటకే యవతరించి రనుట సత్యము.

కృ - అవును శంకరులే యీ శ్లోక గ్రంథిని (ముడిని) చక్కగ నూడదీసిరి. చిత్తము నీయాయత్తమై యున్నదా ?

వి - ఏకాగ్రమై యీ శ్లోక భావమును గ్రహింప నెదురుచూచుచున్నది.

తృ - విను. ఆ శ్లోకమునందు ప్రయోగింపబడిన కర్మ అకర్మ యను రెండు శబ్దములలో ఒక శబ్దమునకు నిర్గుణము నిష్క్రియమునగు పరబ్రహ్మ యర్థము.

మరొక శబ్దమునకు నామరూపాత్మక మగు ప్రపంచము అర్థము. ఒకదానిచేత తెలియబడునదంతయు దృశ్యము. నామరూపాత్మక ప్రపంచమన్నను దృశ్యమన్నను ఒకే అర్థము. అవి పర్యాయపద ములు. అట్టి దృశ్యమునకే, లేక నామరూపాత్మక ప్రపంచమునకే ఈ శ్లోకమున కర్మ అనుపదము వాడబడినది. కావున కర్మ అనగా క్రియలేక వ్యాపారము. అది దృశ్యధర్మము. అకర్మ అను పదము నకు పరబ్రహ్మ అని అర్థము. పరబ్రహ్మ నిష్క్రియము. అది చల నములేనిది. భగవద్గీతా శాస్త్రమున పరమాత్మ స్వరూప మేవిధముగ వర్ణింపబడినదో ఆత్మస్వరూపముకూడ అదేవిధముగ వర్ణింపబడి నది. కావున పరమాత్మ, పరబ్రహ్మ, ఆత్మశబ్దములు సమా నార్థకములు. అట్లే నామరూపాత్మక ప్రపంచమన్నను దృశ్య మన్నను, శరీరేంద్రియాది సంఘాతమన్నను ఒకే అర్థమున వాడ బడినవి. కావున నామరూపాత్మక దృశ్యమునకు కర్మయను పేరును గీత ఎట్లు వాడినదో శరీరేంద్రియ మనోబుద్ధ్యహంకారము లన్నింటిని కలిపి కర్మయను శబ్దమున వాడినది. ఇప్పుడు నీకే మర్థమైనది ?

వి - కర్మయనగా నామరూపములతో కూడిన ప్రపంచము, లేక దేహాది సంఘాతము అన్నిన్ని, అకర్మయనగా నిష్క్రియమైన పరబ్రహ్మ లేక ఆత్మయని అర్థమైనది.

కృ - చలనములేని అచలమైన ఆత్మ నడచుట, పరుగెత్తుట, నిద్రపోవుట అను క్రియలు కలిగియుండదు. మనము ఆలోచించుట, ఆలోచింపక యుండుట, నడచుట, నడపక యూరకుండుట, మాటలాడుట, మౌనముగ నుండుట అను వ్యాపారమంతయు (వ్యాపారమన క్రియ) అంతరమగు మనస్సు యొక్కయు, బాహ్యములగు హస్త పాదాదికముల యొక్కయు ధర్మములు. ఆత్మధర్మములుకాదు. అయ్యును సామాన్య లోకము దేహేంద్రియ సమూహమును, ఆత్మను వేరుగాచేసి చూడదు. ఆ రెండింటిని కలిపియే వ్యవహరించును. వేర్వేరుగా నున్న రెండు వస్తువులను ఒకే వస్తువుగా భావించి వ్యవహరించుట బుద్ధిమంతుల లక్షణమా ? బుద్ధిహీనుల లక్షణమా ?

వి - బుద్ధిహీనుల లక్షణము.

కృ - కావున గీతాశాస్త్రము బుద్ధిహీనులను బుద్ధిమంతులను చేయుటకు ప్రవర్తించినది. అకర్మమైన ఆత్మను, కర్మమైన దేహేంద్రియాదికమును, లేక అకర్మమైన పరబ్రహ్మను, కర్మమైన జగత్తును విడదీసి దేనివి దానివిగా గుర్తెరుగుడని బోధించినది. అట్లు గుర్తెరిగిన వానికే అగ్రస్థానము నిచ్చినది.

"సబుద్ధిమాన్ మనుష్యేషు, సయుక్తః కృత్స్నకర్మ కృత్॥"

అన్నది. అట్టివాడు మానవులలో బుద్ధిమంతుడన్నది. అతడే, యుక్తః అనగా యోగి అన్నది. అతడు కర్మరహస్యమును తెలిసిన కర్మయోగి అన్నది.

ఇక దేహేంద్రియాది సమూహమును, చైతన్యమగు ఆత్మను కలిపి వ్యవహరించుట, విడదీయుట, లేక నామరూపాత్మక మగు

జగత్తును, నామరూప రహితమగు బ్రహ్మమును కలిపి వ్యవహరించుట, విడదీయుట అను విషయమును వివరించెదను.

ఉపనిషద్విజ్ఞానము నామరూపములతో గూడిన, ఈ జగతు కల్పితమన్నది. బ్రహ్మము సత్యమన్నది. అట్లే పంచభూతములచేత నిర్మితమగు దేహత్రయము స్థూల సూక్ష్మకారణ శరీరములుకూడ కల్పితమన్నది. ఆత్మసత్యమన్నది.

వి - కల్పిత మనగా లేనిదనియే గదా అర్థము ?

కృ - కల్పితమను మాటకు లేకపోవుటయే అర్థము. కాని ఇక్కడ కల్పిత శబ్దమునకు కొంత వివరణమున్నది. లేకపోవుట రెండు విధములు. గొడ్రాలిబిడ్డ, కుందేటి కొమ్ము అనునవి త్రికాలముల యందును లేనివి. వాటివలె ఈ ప్రపంచము త్రికాల శూన్యము కాదు.

మానవుని జ్ఞానము రెండు విధములు. యథార్థ జ్ఞానము, అయథార్థ జ్ఞానము. అయథార్థ జ్ఞానమునకు భ్రాంతి జ్ఞానమని కూడా పేరు. త్రాడును చూచి మందాంధకారమున (కొద్ది చీకటి) పామని భ్రమించుట భ్రమజ్ఞానము. అక్కడ భ్రమకలిగిన భ్రమకాలము నందు పామున్నది. ఆ కాలమున త్రాడుకూడ యున్నది. కాని భ్రమనొందిన వాని దృష్టియందు మాత్రము త్రాడులేదు. పాము మాత్రమే యున్నది.

పామును యేత్రాడునందు కల్పించుకొనెనో ఆ త్రాడును గురించి ఆ భ్రాంతి జ్ఞాని యెఱుగడు. పామును మాత్రమే యెఱుగును. అది అతనికి భ్రమజ్ఞానమనికూడ తెలియదు, సత్యమనియే యూహించి యూహ. దానిచేత కలుగు భయము, వణకు, మూర్ఛలుకూడా

సత్యములే. చూచువారందరును పాముకాటు వేసినదనియు, అతడు మూర్ఛ నొందెననియు వ్యవహరింతురు. ఇప్పుడు సర్పమున్న దనియా? లేదనియా?

వి - ఉన్నదనియు, లేదనియుకూడ చెప్పవలెను. భ్రమకాలమునందు న్నది. భ్రమయనునది అసలు కలుగనివాని దృష్టియందును, భ్రమ నివృత్తిమైన కాలమునందును సర్పముండదు.

కృ - అప్పుడు సర్పమేమైనది? ఎక్కడికి పోయినది?

వి - భ్రమ జ్ఞానముచే వచ్చినది. భ్రమజ్ఞానము పోవుటయే సర్పము పోవుట.

కృ - ఆ సర్పము వంటివే నామరూపాత్మకమగు జగత్తును, దేహేంద్రియాది సమూహము కూడ.

వి - సర్పము త్రాటియందు కల్పితమైనది. మదాంధకారము ఆ భ్రమను కల్పించినది. మరి జగత్తును, దేహేంద్రియాది సమూహమును వేటియందు కల్పితములైనవి?

కృ - జగత్తంతయు పరబ్రహ్మయందు కల్పితమైనది. దేహేంద్రియాది సమూహము ఆత్మయందు కల్పితమైనది. అక్కడి చీకటివలెనే అవిద్యయనునది యిక్కడ ఈ భ్రాంతిని కల్పించినది.

నేను నీకు ఆత్మ పరమాత్మ శబ్దముల కొక్కటే యర్థమని చెప్పి తిని గుర్తున్నదా?

వి - చిత్తము. అద్వైతమున ఆత్మయే పరబ్రహ్మయనియు, పర బ్రహ్మయే ఆత్మయనియు నిర్ణయ మనిరి.

కృ - ఈ ఘట్టమున ఆ విషయము మరువకూడదు. జగద్బ్రహ్మలను, ఆత్మానాత్మలను (అనాత్మ-దేహేంద్రియ సమూహము) విడదీయుట యనగా ఆ రెండును వేర్వేరు పదార్థములనియు ఆ రెంటిని విడదీయుట యనియు అర్థము కాదు. రజ్జుసర్ప భ్రాంతియందు సర్పము కల్పితమని తెలియుటమే రజ్జుసర్పములను విడదీయుట. సర్పము కల్పితమని తెలియుటతోడనే సర్పభయముపోవును. సర్పభయమును పోగొట్టుటకు సర్పజ్ఞానమును రజ్జుజ్ఞానమును అవసరములే. ఆ రెంటికిని తోడుగా ఆ రెంటియొక్క స్వరూపమును బోధించువాడును, ఆ బోధించువానిచేతియందొక దీపమును అవసరము. అట్లే జగద్బ్రహ్మలను విడదీయుటకు లేక ఆత్మానాత్మలను విడదీయుటకు బోధకుడును అతనిచేత శాస్త్రమును అవసరము. ఆ బోధకునకే గురువనిపేరు. ఆ రెండింటి సహాయమున అధిష్ఠానమగు బ్రహ్మయందు జగత్తుకల్పితము, ఆత్మయందు దేహాదులు కల్పితము లని బోధించి, ఆ బోధయను దీపకాంతిని అందించగా ఆత్మయందు అనాత్మభ్రాంతి విడిపోవును. బ్రహ్మయందు జగద్భ్రాంతి తొలగును. బ్రహ్మను యథార్థముగను, అట్లే ఆత్మను యథార్థముగను తెలిసికొనును. దానినే అకర్మయందు కర్మను చూడవలెనని గీత చెప్పినది. ఇదియే అకర్మయందు కర్మను జూచుట.

వి - బ్రహ్మమే జగత్తను పేర వ్యవహరింప బడుచున్నదన్నమాట.

కృ - అవును. నామమాత్రమే జగత్తు.

వి - మరొక్క ఉదా....

కృ - సందేహమెందుకు? మరియొక ఉదాహరణను చూపుదును. పంచదార చిలుకను పరిగ్రహించుము. అందెన్ని పదములున్నవి?

వి - పంచదార, చిలుక అను రెండు పదములున్నవి.

కృ - అందు పంచదారను, చిలుకను విడదీసి చూపగలవా? లేక చూచె దవా? అసలు విడిపడునా?

వి - అవి రెండును విడివడిలేవు. నామమాత్ర వ్యవహార మున్నది.

కృ - మరి అందు చిలుకయను పదమునకు అర్థమెక్కడున్నది?

వి - అందు ఆ పదమున కర్థమగు చిలుకలేదు. పంచదారయే చిలుకగా చేయబడినది. ఆ పంచదారకే చిలుకయని వ్యవహారము.

కృ - అట్లే జగద్వ్యవహారము కూడ.

వి - పంచదారయే చిలుకగా మారిన దనవచ్చునా?

కృ - ఒక వస్తువు మరియొక వస్తువుగా మారినప్పుడు పూర్వరూపము పోవలెను. పంచదార మారినదా?

వి - లేదు.

కృ - కావున బ్రహ్మపరిణమించలేదు. దీనికి వివర్తమని పేరు. పాలు పెరుగుగా మారుట, పరిణామము. పరబ్రహ్మ నిర్వికారము గనుక పరిణమించదు.

అకర్మణి కర్మయః పశ్యేత్ సబుద్ధిమాన్ — అనునది అర్థమైనదా?

వి - చక్కగా తెలిసినది.

కృ - కర్మయనగా దేహేంద్రియ సమూహము. ఆ దేహేంద్రియ సమూ హము ఆత్మయందు కల్పితము. ఆత్మకుకూడా అకర్మయనియే వాడినది. ఆత్మయందు లేక అకర్మయందు కర్మలేక దేహేంద్రియ

సమూహము కల్పితమని తెలియుటకూడ అకర్మయందు కర్మ దర్శనమే. ఇది దేహేంద్రియ సంఘాతమును ఆత్మనుండి విడదీయుట. ఈ జ్ఞానమునే అకర్మయందు కర్మదర్శనమని గీత చెప్పినది.

ఇప్పటి కేమి యర్థమైనది?

వి - దృశ్యమగు జగత్తు బ్రహ్మమునందు కల్పితమేగాని యథార్థము కాదనియు, అట్లే స్థూలములగు కర్మేంద్రియములును, సూక్ష్మములైన ఆంతరములగు మనోబుద్ధి చిత్తాహంకారములును జ్ఞానేంద్రియ సమూహమును ఆత్మయందు కల్పితములనియు ఏ యధిష్ఠానమునందు అట్లు కల్పితమైనదో దానికే అకర్మయని గీత పేరు పెట్టినదనియు ఆ విషయము తెలియుటే అకర్మయందు కర్మను చూచుటయనియు తెలిసినది.

కృ - ఇక తెలియవలసినదేమి?

వి - కర్మయం దకర్మను చూచుట.

కృ - కర్మయన దేహేంద్రియాది సంఘాతమని చెప్పితివిగదా ?

ఆ సంఘాతము అనగా మనోబుద్ధులు, ఇంద్రియములు వ్యాపారములు గలవై యున్నచో ఆత్మ వ్యాపారము కలదై యున్నదనియు, అవి తమతమ క్రియల నన్నింటిని విరమించి కదలక మెదలక యున్నప్పుడు ఆత్మ నిష్క్రియమై చలనము లేకుండ నున్నదనియు భావించకుండుట కర్మయందు అకర్మను చూచుట. అనగా చలనాది క్రియ వ్యవహారమంతయు ఆత్మదికాదు. ఆత్మచిన్మాత్రము. నిష్క్రియము. అని ఆత్మస్వరూపమును గుర్తెరుగుటకే కర్మయం 'దకర్మ

దర్శనమని శ్రీకృష్ణులు వాడిరి. ఇదే పత్యమగు జ్ఞానము. దీనికి వ్యతిరేకము భ్రమజ్ఞానము. భ్రమజ్ఞానమును తొలగించుకొమ్మని గీత బోధించినది. విజయా! స్థిరమగు నాత్మయందు చలనాదిక్రియలను కల్పించుకొని వ్యవహరించుటకు మరియొక ఉదాహరణను కూడా చెప్పెదను. ఒక పడవయందు ప్రయాణముచేయు నప్పుడు నది యొడ్డునందున్న వృక్షములు పరుగెత్తుచున్నట్లుగాని నెమ్మదిగా పోవు నట్లుగాని కనపడును. అప్పుడా వృక్షములయొక్క గమనము దేనిని బట్టి ?

వి - పడవయొక్క గమనమును బట్టియే.

కృ - పడవనుబట్టి ఆ వృక్షములు గమనమును చేయుచున్నవా ?

వి - లేదు. చేయుచున్నట్లుగ పడుచున్నవి.

కృ - స్థావరములకు చలనము యథార్థముగా జరుగదు. కాని చూచువాని అజ్ఞానమువలన కనబడవచ్చును. ఇదే అజ్ఞానము అని తెలియుటచే యథార్థము తెలియుట. యథార్థము వేరుగను, అయథార్థము వేరు గను లేదు. అయథార్థముగూడ యథార్థములోనిభాగమే. యథార్థమున లీనమైయేయున్నది. అయథార్థము భాసించని దృష్టిలో యథార్థ మొక్కటే యున్నది. జగత్తును, దేహేంద్రియాదికములును భాసిం చని జ్ఞాని దృష్టియందున్నది యథార్థమొక్కటే. ఆత్మ ఒక్కటే. లేక పరమాత్మ ఒక్కటే. ఇదియే జ్ఞానయోగసారము. ఈ విషయము అనుభవమునకు వచ్చుటయే జ్ఞానము.

వి - అయితే భోజనమును చేయుట, భోజనమువలన గలిగిన తృప్తిని అనుభవించుట, కాంతాసుఖము ననుభవించుటకు యత్నముచేయుట,

అనుభవించుట అనుభవించితినని ఆనందించుట ఇదంతయు ఆత్మకు సంబంధము లేదన్నమాట.

కృ - ముమ్మాటికిని లేదు.......సర్వం మనఏవ. కర్తృత్వము (చేయుట) భోక్తృత్వము (అనుభవించుట) ఆత్మకు లేవు. ఆ రెండును మనో ధర్మములే! ఆత్మ కర్తకాదు, భోక్తకాదు. అంతయు మనః కల్పితమే. గాఢనిద్రయందు ఆకలి దప్పిక లేమైనవి? సుషుప్తియే ఇందుకు సాక్ష్యము.

వి - మరి ఈ విషయము గీత చెప్పినదా ?

కృ - చెప్పకేమి? చెప్పినది.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥ 3.27

ప్రకృతేః గుణైః సర్వశః కర్మాణి క్రియమాణాని అహంకార విమూఢాత్మా అహంకర్తా ఇతి మన్యతే॥

అని శ్లోకము యొక్క అన్వయము.

మనము చేయు సమస్త కర్మలును సత్వరజస్తమో గుణాత్మికమగు ప్రకృతియొక్క గుణవికారములుగాని ఆత్మ వికారములు కావు అను విషయ మెరుగక మూఢుడు అజ్ఞానము చేతనే కర్తనని భావించు చున్నాడని గీత స్పష్టముగా చెప్పినదీ శ్లోకమునందు.

వి - ఇక్కడ మూఢాత్మయనగా దేహేంద్రియాది సంఘాతమును నేనను కొను శరీరాభిమానియేగదా?

కృ - అవును. ఆశరీరాభిమానిత్వమే జీవత్వము. అజీవత్వమే మూఢ త్వము. ఆ మూఢత్వమునుండి వచ్చినవే అహంకర్తా అహం

భోక్తా అను భావములు. నేను కర్తను, భోక్తను అనుకొనుటకు శరీరాభిమానమే కారణము.

వి - ఈ శ్లోకమునందలి ప్రకృతి శబ్దమునకేమైన వివరణమున్నదా?

కృ - 18వ అధ్యాయమున 14, 15, 16 శ్లోకములలో కర్తృత్వమనునదీ ఐదింటి కూటమిచే కలుగుచున్నదని ఐదు కారణములను ప్రతిపాదించి, ఇక్కడి ప్రకృతి శబ్దమును వివరించినారు శ్రీకృష్ణులు. ఆ కారణము లివి. 1) శరీరము 2) శరీరాభిమానియై నేనీ ఫలముల ననుభవించుచుంటిని. ఈ ఫలములకు నేనే భోక్తను అను కొను భోక్త. 3) జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, మనోబుద్ధులు. 4) ప్రాణపంచకము, 5) పైన చెప్పిన నాలుగింటికిని అధిష్ఠానదేవత లగువారు. ఈ కూటమి వలననే పుణ్యకర్మలుగాని, పాపకర్మలుగాని, మనోవాక్కాయములచే చేయు ప్రతికర్మయు జరుగుచున్నదని వ్యాఖ్యానించిరి. ఇట్టి విషయము తెలియని వారినే మూఢుడనియు, అకృత బుద్ధియనియు పేరు పెట్టిరి. అకృత బుద్ధి అనగా— గురువేదాంత శాస్త్రముల యొక్క ఉపదేశములులేని అసంస్కారులని శంకరుల వ్యాఖ్యానము.

"అకృతబుద్ధిత్వాత్-అసంస్కృత బుద్ధిత్వాత్" శం. భా.

వి - మరి అకర్తయు అభోక్తయునై, సాక్షి చైతన్యమై వెలుగు నాత్మయందు కర్తృత్వాదికములను కల్పించిన దెవరందురు?

కృ - మాయ, అవిద్య.

వి - మాయ అను పదమునకు అర్థమేమందురు ?

కృ - యా-మా-సామాయా ఏది లేదో అది మాయ.

శి - మాయా ప్రకృతి శబ్దములు రెండును ఒకే అర్థమును బోధించునా ?

కృ - కొద్ది భేదము కలిగియున్నది. సత్వరజస్తమో గుణములయొక్క సామ్యావస్థకు ప్రకృతియనియు, ఆగుణముల వైషమ్యమునకు మాయయనియు పేర్లు. ఇది అద్వైత శాస్త్ర నిర్ణయము, ద్వైత శాస్త్రములందు మాయ ప్రత్యేక పదార్థము. అద్వైతమాయకు ప్రత్యేక లక్షణములేదు. కేవలము లేకపోవుటకే మాయ యన్న నిర్వచనము లేదు. మాయాకార్యమగు జగత్తు కనబడుచుండుటచేత మాయ లేనిదికాదు. జగత్తుయొక్క ఉనికి స్వప్నమువంటి దగుట చేత మాయకు ఉనికిలేదు. జగత్తును సృష్టించుచున్నది గనుక సృష్టి కర్త్రి అనకూడదు. జగత్సృష్టి కేవలము మాయవలననే యగుట లేదు. బ్రహ్మమునుండి సృష్టియగుచున్నది. అందువలన అద్వైతులు మాయను అనిర్వచనీయమని వర్ణించినారు.

"అఘటిత ఘట నాపటీయసీ మాయా"

అసంభవములను సంభవములనుగా చూపించును. సంభవమును అసంభవముగా చూపును.

సీ. ఉన్నది లేదని యూహింపగా నేర్చు
లేనిది కలదన లెస్స నేర్చు
నజడంబు జడమని యాగడింపగ నేర్చు
జడ మజడంబని చాటనేర్చు
సుఖము దుఃఖంబుగా చూపి చెప్పగనేర్చు
దుఃఖంబు సుఖమన దొలుత నేర్చు
నిది యదిగాదని యింపుగానన నేర్చు
నది యిదిగాదని యనగనేర్చు

ఎన్ని చమత్కారములనైనను చూపును. అందువలన అనిర్వచనీయ అనిరి.

వి - మరి అవిద్య యెక్కడిది?

కృ - త్రిగుణముల సామ్యావస్థగల ప్రకృతి శుద్ధమగు సత్వగుణము అధికముగా గలదైనప్పుడు మాయ, ఆసత్వము మలిన సత్వమైనప్పుడు అవిద్య అను పేర్లను కలిగి యుండును. మాయయందు ప్రతిబింబించిన చైతన్యము ఈశ్వరుడు. ప్రకృతి అద్దమువంటిది. స్వచ్ఛమైన అద్దము మాయ. మలినమైన అద్దము అవిద్య. జీవేశ్వరుల ఉపాధులు అద్దముల వంటివి. అద్దములు బ్రద్దలుకాగా ప్రతిబింబములు బింబములో కలియునట్లే జీవేశ్వరుల ఉపాధులు తొలగిపోగా అఖండ చైతన్యమే మిగులును.

జీవేశ్వరుల కేకత్వమన వారి ఉపాధులను వాక్య విచారణచేత తొలగించుటయే. దీనినే శంకరులు "వాక్యార్థశ్చ విచార్యతాం" అని ప్రబోధించిరి. వాక్యార్థమనగా తత్వమస్యాది మహావాక్య చతుష్టయము. ఈ వాక్య విచారణపైన ఆధారపడియే అద్వైత సిద్ధాంతమంతయు నడచినది.

వి - మరి మన గీతాశాస్త్రము కూడ పై విధమున జీవబ్రహ్మైక్యమునే బోధించినదా?

కృ - శంకర సిద్ధాంతమే నా లక్ష్యమని నమ్మిన సాధకునకు జీవబ్రహ్మల కద్వైతమునే బోధించును. ద్వైత సిద్ధాంతములలో జీవుడెప్పుడును జీవుడే. ఈశ్వరుడెప్పుడును ఈశ్వరుడే. జీవేశ్వర భేదము పోవునదికాదు. అద్వైత సిద్ధాంతమున జీవేశ్వరులు బింబ ప్రతి-

బింబ న్యాయమున నందురు. ద్వైతసిద్ధాంతమున అంశాంశి న్యాయముగలవారగుదురు. అనగా భగవంతుడు అవయవి. జీవులు అవయవములు. అవయవి ఎట్లు సత్యమో అవయవమును అట్లే సత్యమని వారి నిర్ణయము. ప్రతిబింబము మిథ్య. బింబమొక్కటియే సత్యము. కావున బ్రహ్మమొక్కటియే సత్యము. జీవత్వము ప్రతిబింబము కనుక మిథ్య. జీవబ్రహ్మల కేకత్వమనగా జీవత్వము మిథ్యయని తెలియుట. ఉన్నది ఒక్కటే పదార్థము. ఆ పదార్థమే జగత్కారణము. రెండవ పదార్థము లేనేలేదు అని నిర్ణయము.

వి - గీత యీ నిర్ణయమును చెప్పినదా?

కృ - శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోంత స్త్వనయో స్తత్వదర్శిభిః ॥ 2-16

అసతః—భావః-న విద్యతే సతః—అభావః న విద్యతే
అనయోః-ఉభయోః-అంతః తత్వదర్శిభిః దృష్టః॥

ఇది శ్లోకాన్వయము.

అనగా యీ శ్లోకమున సత్ "అసత్" అను పదములు రెండున్నవి. ఆ పదములలో "సత్" అను పదము పరబ్రహ్మను చెప్పును. సత్—అనగా ఉనికి. ఉండుటయే లక్షణముగాగలది పరబ్రహ్మము. ఆ సత్తున కెప్పుడును లేకపోవుట యనునది లేదు. మూడు కాలములయందును ఉండును. అసత్తు యెప్పుడును లేదు. మూడు కాలములలో నేకాలము నందును లేనిదేనని నిర్ణయము. ఇదియే గీతలోని పరమసిద్ధాంతము. కావున గీతాశాస్త్రము సత్యపదార్థ మొక్కటియేనని చెప్పినట్లేకదా?

వి - అవును.

కృ - ఒక కారణమును ఆధారముగా జేసికొని పుట్టిన దేదియు శాశ్వతము కాదు. పుట్టిన ప్రతి వస్తువును వికారము కలదేయగును.

ఈ సత్, అసత్ అను శబ్దములే గీతయందు, దేహి, దేహము-పరా ప్రకృతి, అవరాప్రకృతి, క్షేత్రజ్ఞుడు, క్షే త్రము, అక్షరము, క్షరము, పురుషుడు, ప్రకృతి అను పదములతో 7,13,15 అధ్యాయములందు వర్ణింపబడినవి. ఆ ప్రదేశములందుకూడ, ఒకటి నిత్యము రెండ వది అనిత్యము అని తెలియబరచిరి. కావున త్రికాల సత్యమగు పదార్థము ఒక్కటేయని గీత చెప్పినట్లయినది.

వి - ఆ అధ్యాయములలోని శ్లోకసంఖ్య వందింతురా?

కృ - 7. అ. 4. 5. శ్లోకములు; 18 అ. 1 శ్లో; 15 అ. 1 శ్లో.

వి - జీవేశ్వరులకు బింబ ప్రతిబింబన్యాయ మెచ్చట వర్ణింపబడినది?

కృ - 15. అ. 1 శ్లోకమున

"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" 15-7.

జీవలోకే-ప్రాణిలోకమునందు జీవభూతః-కర్త భోక్తయను ప్రసిద్ధ వ్యవహారము కలిగిన సనాతనః- చిరంతనుడగు జీవుడు. మమ— నాయొక్క అంశః ఏవ, ఏకదేశమే అని అర్థము.

ఇక్కడ అంశయను పదమునకు జలమునందు ప్రతిబింబించు సూర్యుడు ఆకాశ సూర్యుని అంశయెట్లగునో అట్లే జీవుల అంతః కరణమందు ప్రతిబింబించు చైతన్యము జీవుడుఅని శంకరుల నిర్ణ యము.

"అంశోభాగః అవయవ ఏకదేశ ఇత్య నర్థాంతరం యథాజల
సూర్యకః సూర్యాంశః"

వి - జీవుడు నాయంశమని కాక జీవుడని వ్యవహరించు చైతన్యము వేనే అని గీతాచార్యులు స్పష్టపరచిరా?

కృ - సుస్పష్టముగా చెప్పిరి.

వి - ఎక్కడ?

కృ - 13 అ. 2వ శ్లోక ప్రథమ పాదమున.

వి - క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి సర్వక్షేత్రేషు భారత॥
ఇదియేగదా?

కృ - అవును అందు క్షేత్రజ్ఞానవగా జీవుడు. క్షేత్రమనగా శరీరము.

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే॥ 13-1

ఈ శరీరమునకు క్షేత్రమనిపేరు. ఈ మన శరీరమునకే కాదు, "ఇదం" అన్న సర్వనామము ఈ పరిదృశ్యమానమగు జగత్తునంతను చెప్పును. క్షేత్రమనగా రక్షించునది, నశించునది, ఉత్పత్తి చేయునది, అను అర్థములు కలిగిన పదము. ఈ శరీరమును ఆధారముగా చేసుకొనియే అవిద్యావృతమగు ఆత్మను గ్రహింతుము. ఆత్మను అవిద్యనుండి తొలగించి, రక్షించినది నది గనుక క్షేత్రమైనది. లేక శరీరము నశించును గనుక క్షేత్రము. భూమి తనయందు నాటిన బీజములనుండి వ్యవసాయమునకు ఫలము నందించునట్లు జీవుని ప్రాక్తన కర్మల ఫలముల నుత్పత్తి చేయునది కనుక క్షేత్రమైనది. ఈ క్షేత్రము వికారము. వికారమెప్పుడును నశించుచే స్వభావముగా గలది. క్షేత్రము వికారము అనుమాటను, 5-6 శ్లోకముల వర్ణించినారు.

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః॥
"ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారము దాహృతం॥"

ఇందు క్షేత్రభాగమంతయు వికారమని తేలినది. కాని ఈ రెండు శ్లోకములలో రెండవ శ్లోకప్రథమపాదమున చేతనా అను పదము వాడబడినది. ఈ పదము క్షేత్రమునంతను అపాదమస్తకముగా ఎవరు తెలుసుకొనుచున్నారో లేక ఏది తెలుసుకొనుచున్నదో దానికి పేరు. ఆ తెలుసుకొనునది జీవుడు. లేక క్షేత్రజ్ఞుడు, లేక దేహి, పరాప్రకృతి, అనుపేర్లతో వ్యవహరింపబడు నా క్షేత్రజ్ఞానికూడా నన్నుగానే గుర్తెరుగుమని బోధించినారు. ఇదియే జీవునకును పర బ్రహ్మకు భేదములేదని సుస్పష్టముగ చెప్పినమాట.

శ్లో॥ క్షేత్రజ్ఞంచాపి, మాం పరమేశ్వరం అసంసారిణం విద్ధి॥ శం.భా. క్షేత్రజ్ఞునకును పరబ్రహ్మకును మధ్యభేదమును కల్పించినది. అధ్యాస, లేక అజ్ఞానము, అవిద్య, మోహము ఇవన్నియు పర్యాయపదములు. నేను నాది అను జ్ఞానమును కల్పించిన కల్పనాశక్తికి పేర్లు.

వి - పర్యవసానము నేనేయని తెలుసుకొనవలెనందురు.

కృ - 13వ అధ్యాయమున 12వ శ్లోకము మొదలు 17వ శ్లోకము వర కును సర్వోపనిషత్ప్రతిపాద్యమైన పరబ్రహ్మతత్త్వము వర్ణింప బడినది. ఆ వర్ణింపబడిన బ్రహ్మతత్త్వమే నేను ఇంతకు పూర్వము నేను అనుకొనుచున్న విజయుడనుకాను అని తెలుసుకొని మననముచేసి, బుద్ధిని స్థిరముగానించుకొనుటయే పర్యవసానము.

క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీసి క్షేత్రమంతయు నాయందు (ఆత్మయందు) కల్పితము. క్షేత్రజ్ఞుడు పరమాత్మకంటె అభిన్నుడు (వేరుకాడు) అను జ్ఞానమే నాకు ఇష్టమని శ్రీవారి సూక్తి. ఇదియే సమ్యక్ జ్ఞానము.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞ యోర్ జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ

వి - బ్రహ్మతత్వ మెట్టిదని గీత వర్ణించిన దందురు?

కృ - యథార్థమునకు దృశ్యపదార్థమువలె దృక్కునకు లేక పరబ్రహ్మకు ఒక నిర్దయమగు లక్షణములేదు. అది ఒకప్పుడు పుట్టినదిగాదు. అన్ని పుట్టుకలకును అది ఆధారము. దానిని సత్ అనిగాని, అసత్ అనిగాని పలుకుటకునొక నిర్వచనపదములేదు. అందుకని అది శూన్యముకాదు, పరిపూర్ణము. తేనెయందలి మాధుర్యమువలె అంతటను అది వ్యాపించియున్నది. కాని ఆ బ్రహ్మమునకు కన్ను ముక్కు చెవి శరీరము లేవనునదిలేదు. కాలులేకయే నడుచును. కన్నులేకయే చూచును. చెవి లేకయే వినును. అనగా బ్రహ్మమునందారోపింపబడిన ప్రపంచమునంతను వ్యాపించగా జ్ఞాన రూపమగు నాతనికి పాణిపాదములు లేకపోవుటగాని యుండుటగాని ఎక్కడిది? అతడే సమస్త ప్రకాశములకు ప్రకాశము. చూడబడు దానినంతను చూచుచు తన వెలుగును దాని కందించుచున్నాడు. ఆ బ్రహ్మమే అవిద్యాకల్పితమగు దేహాత్మబుద్ధికి కొలతకాగా అది బాహ్యము. దానిని ప్రత్యగాత్మయని నిర్ణయించగా దేహదృష్టిని ఆధారముగా గొని అంతరమై వెలయును.

"బహిరంతశ్చ భూతానాం" అని గీతాశాస్త్రము వర్ణించినది.

ఆకాశమువలె పరిమిత వస్తువులందుండి విభక్తము. అపరిమితమై అవిభక్తము. దానిని ఉపనిషత్తులు సచ్చిదానందమని వర్ణించినవి. ఇదియే గీతాశాస్త్రము చెప్పిన వర్ణనము. నేను మీకు ఒక చిన్న పద్యమును వినిపించెదను. అదియే సారము.

ఆ॥ ఇదియు నదియు నట్టి దిట్టి దింతంతని
పలుకరాని దెద్ది బ్రహ్మమదియె
యిదియు నదియు నట్టిదిట్టి దింతంతని
యరయు తెలివి యదియె యవియు నదియె.

ఈ విషయమునే తత్త్వమసి మహావాక్యముకూడ బోధించినది. ఈ సిద్ధాంతమును నూతనముగా శ్రీకృష్ణులు పదేశింపలేదు.

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదై శ్చైవ హేతు మద్భిర్వినిశ్చితైః॥

వేదములును, వేదప్రమాణవిదులగు వశిష్ఠాది ఋషులును, బ్రహ్మ ప్రతిపాదకములగు నుపనిషత్తులును, మీమాంసా విధానముగ నుపదేశించినవని నిర్ణయింపబడినది. దీనిని గ్రహించి నేను ఎవడను? అను ప్రశ్నకు నీకు నేను పదేశించిన ఉపనిషత్తర్క రహస్యములను మననము చేసి ఈ క్రింది శ్లోకములను భావించుము.

శ్లో. నాహం దేహో నమేదేహః కేవలోహం సనాతనః
ఏకమేవాద్వితీయం వై బ్రహ్మణో నేహకించన.
బ్రహ్మైవాహం న సంసారీ న చాహం బ్రహ్మణః పృథక్

ఈ శరీరత్రయము నేను కాను. (స్థూల సూక్ష్మ కారణములు)

శుద్ధ చిన్మాత్రుడనైన నాకు శరీరము లేదు. నేను కేవలుడను, సనాతనుడను. సంసారిని కాను. బ్రహ్మ వస్తువుకంటె నేను

వేరై లేను. అద్వితీయమగు బ్రహ్మ వస్తువుగాక వేరొక వస్తువీ దృశ్యమునందు లేదు. అని మననము చేయుము.

గురువుల వలన యుపదేశము నందుకొనుట శ్రవణము. దానిని నిరంతరాభ్యాసము గావించుటే మనన నిధిధ్యాసలు.

సర్వకాలముల యందును ఆ పరబ్రహ్మనే ధ్యానించుచుండుట. ఆ పరబ్రహ్మను గూర్చియే సంభాషణము, మిత్రుల గూడినప్పు డొకరికొకరు ఆ పరబ్రహ్మ తత్త్వమును గురించియే మాటలాడు కొనుట. ఇట్లు సర్వకాలములయందును మనస్సును ఆ పరబ్రహ్మము నందే చేర్చి యుంచుము. అట్టి నిరంతర ధ్యానముచే మనస్సు నది రూపుమాయగా అమనస్కమే జ్ఞానఫలము. ఇదియే సమస్త శాస్త్రములయొక్క ఉపదేశ సారము.

ఈనాటి గోష్ఠి సమాప్తమైనది. ఆనందబాష్పములతో విజయుడు-

౨ - శ్లో॥ శ్రీగురు చరణ ద్వంద్వం వందేహం మథిత
దుస్సహ ద్వంద్వం
భ్రాంతి గ్రహోపశాంతిం పాంసుమయం
యస్య భసిత మాతనుతే॥

శ్రీగురు చరణ రజము జీవుని భ్రాంతి గ్రహమును పారదోలును. ద్వంద్వముల బాధించి మథించునది గురుపాదద్వంద్వమే.

ఓం తత్సత్

—:×:—

# గీతా హృదయము

## స్థితప్రజ్ఞులు - త్రిగుణాతీతులు

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥

ఉపనిషత్సారస్వతము చక్రవర్తి పదము యోగులకే కాని భోగులకు కాదన్నది. భాగ్యవంతులను బిరుదము కూడ యోగిపుంగవులకే సార్థకమన్నది. ఆ భాగ్యవంతుల భాగ్యనగరములు కూడా ప్రకృతి సౌందర్య విలసితములగు వనసీమలుగానే వర్ణించినది. సారస్వతమే కాదు. అనుభవజ్ఞులగు వారుకూడా కోరిన మహా భాగ్యమదియే. "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః॥" అని శంకరులు. మరియొక మహనీయుడు.

శా ॥ కౌపీనంబును, జీర్ణ కంథయు, నపేక్షా శూన్య భైక్షంబు, జిం
తాపాయంబు, వనశ్మశానముల నిద్రావాప్తి దుర్వార స ।
ద్వ్యాపారంబు, ప్రశాంతచిత్తమును, యోగారూఢియున్
వృత్తి సం
క్షేపంబుం గలదేని యోగికి త్రిలోకీప్రాభవం బేటికిన్.॥

యథార్థమగు భాగ్యము ననుభవించు భాగ్యవంతులకు కౌపీనమాత్ర పరిధానము చాలునని భారతీయుల సిద్ధాంతము. ఆ కౌపీనధారణ మనకు గూడ అర్థమున్నదేమో! ఆత్మను మరగుపరచునది అహంకారము. ఆ అహంకారావరణమే వస్త్రము. ఆ వస్త్రఖండము

ఆవరణములోని భాగమంతయు అంతరించి ఇంతమాత్రము మిగిలిన దని చెప్పుచున్నదేమో ? ఆ కౌపీనమాత్రముకూడ వదలుట నిరా వరణమగు అఖండాత్మకు చిహ్నము.

కౌపీనమును గూడా ధరించనివారు దిగంబరులు. దిగంబరులన దిక్కులే అంబరముగా గలవారని అర్థము వచ్చును. వస్త్రమును ధిక్కరించి దిక్కులను వస్త్రములుగా గ్రహించుట. ఒక మహాకవి యిట్లు చెప్పినాడు.

శ్లో॥ పాణిః పాత్రం పవిత్రం భ్రమణపరిగతం భైక్షమక్షయ్య మన్నం
విస్తీర్ణం వస్త్రమాశాదశక మచపలం తల్ప మస్వల్ప ముర్వీ
యేషాం నిఃసంగతాంగీకరణ పరిణత స్వాంత సంతోషిణ స్తే
ధన్యాః సన్యస్త దైన్య వ్యతికర నికరాః కర్మ నిర్మూల యంతి॥

ఆ దిగంబరులు న్యాయమునకు వస్త్రవిహీనులు గారు. ఆవరణ రహితు లగుటచేత పరిమిత వస్త్రమును వదలి అపరిమితమగు దిక్కులను వస్త్రమును ధరించిరి. ఆ దిక్కులను వస్త్రము మలిన రహితము. ఆ వస్త్రమెంత యపరిమితమో వారు పరుండు తల్పమును నంత విశాలమగు భూభాగమేనట. ఆ విశాల భూభా గమున పరున్నవారి యంతఃకరణము సంగరహితమై పరిపక్వము నొందగా నమందానంద సందోహమున వారు ధన్యులైరి వారి ప్రాక్తన కర్మలన్నియు దగ్ధము కాగా దుఃఖ భాగులు కాలేదు. దైన్యము కలికమునకైనను వారి యొద్ద దొరకదు. ఆనందమూ ఘనమైయుండ నాకలి నెదుర్కొనుటకు భిక్షమాత్రము చాలును. అందుకు పాత్ర వారి పాణిపంకజమే. భారతీయ భాగ్య వైభవ మింత మిన్ను ముట్టియుండ పాశ్చాత్య వైభవముల కువ్విళులూరు

వారు గీత వర్తము చేసికొనగలరా? గీతా శాస్త్రమునకు ఆభాసలగు వర్ధముల జెప్పుదురు.

భారతదేశమున వీరు యథార్థమగు చక్రవర్తులు. వీరి ఆత్మ సామ్రాజ్యములు సుస్థిరములు. అస్థిరములగు భూఖండములను వాంఛింపరు. జన్మ కర్మలను శత్రువులు నిర్మూలనము కాగా నిష్కంటకమగు ఆత్మ సామ్రాజ్యమున అఖండానంద వైభవోపేతులై భాగ్యలక్ష్మియన నేమేనని భౌతిక లక్ష్మిని త్రోసిరాజనిరి. కావుననే ఆ మహనీయుల ముఖమండలములం దెన్నడును చిరునగవు తొలగిపోదు. ఆనందమను పేర పిలువబడు పరబ్రహ్మమే వారి ముఖపద్మమున మందహాసమను పేర వసించియుండును. వారు చూపునట్టి ఆ ఆనందము కేవల బాహ్య ప్రపంచమందలి పదార్థములకు సంబంధించినది కాదుగదా? అది బాహ్యాభ్యంతరముల నిండి నిబిడీకృతమై యున్న సచ్చిదానంద బ్రహ్మమును మఱగిన అనుభూతిలోని దృశ్యము. ఆ భాగ్యవంతుల నేత్ర ద్వంద్వము ఐశ్వర్య మదమున మత్తిల్లిన భావములతో కలసిమెలసి మూయబడియుండవు. ఆత్మావలోకనమునకై మూతలువడియు దెరువబడినప్పుడా కన్నులు వికసిత పుండరీకములవలె శాంతరసమును వెదజల్లుచు నాశ్రితులగు వారల నాహ్వానించుచుండును. మరి వారి హృదయములో? అవి అమృత సరోవరములు. వారి భావములు బ్రహ్మానంద రస తరంగములు. వారికే గీతాశాస్త్రము స్థితప్రజ్ఞులనియు, భక్తులనియు, త్రిగుణాతీతులనియు నామకరణముల గావించినది. అట్టి మహనీయుల చర్యలలోని విశేషములను వర్ణించునదే నేటి కృష్ణానంద విజయుల గోష్ఠి;

వీరిగోష్ఠి ప్రారంభమై నేటికి పదునైదు దినములు గడచినవి. కర్మ యోగమును గురించి నాలుగు రోజులు గోష్ఠి సాగినది. భక్తి యోగము ధ్యానాంగములతో గూడ నేడు రోజులలో ముగిసినది. ఈ జ్ఞానయోగమున మొదటిరోజు యోగప్రశస్తి యను పేర జ్ఞాన ప్రభావమును, రెండవరోజు ప్రయత్నమనుపేర సాధకుని కర్తవ్య ములను, మూడవరోజున సాధనలు అనుపేర వైరాగ్యాది సంపద లను వర్ణించబడినవి. నిన్నటి గోష్ఠి ఉపదేశ ప్రకరణము. అందు ఆత్మతత్త్వము ప్రతిపాదించబడినది. నేటి గోష్ఠి స్థితప్రజ్ఞుడు - త్రిగుణాతీతుడు అనునది.

కృష్ణానంద విజయులు గోష్ఠిపీఠము నలంకరించినారు. విజయుడు సాష్టాంగము గావించి గురువందన గీతము నాలాపింపగా గోష్ఠి ప్రారంభమైనది.

శ్లో॥ ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే
వ్యోమవద్వ్యాప్త దేహాయ దక్షిణామూర్తయేనమః॥

విజయుని ప్రశ్నయిది.

వి - గురువర్యా! సమాధినిష్ఠులగు వారి దినచర్య లెట్టివో సెలవిత్తురా?

కృ - వారి దినచర్యలును, సామాన్యమానవుల దినచర్యలవంటివే. కాని భావభేద మొక్కటే సామాన్యమానవ సమాజమునుండి వారిని విడదీసినది. వారి భావప్రపంచమునే గీతాశాస్త్రము వర్ణించినది. గీతాశాస్త్రమున రెండవ అధ్యాయమందలి 69వ శ్లోక మెప్పుడైన నీ కంటబడినదా?

వి - కంటబడ టేమి? వంటబట్టలేదు. ఆ శ్లోకమునందలి పదములు రాత్రింబవళ్ళయందలి కర్తవ్యములనే తారుమారుజేసి చెప్పినవి.

ఒకరికి రాత్రికాలము మరియొకరికి పగలు. ఒకరికి పగలు మరి యొకరికి రాత్రియని చెప్పినది. కాల విభాగము మానవ సమాజమున కొక్కటేగాని రెండులేవుగదా ?

కృ - ఆ పదములు తామసారముగా నుండుటకాదు. గీతాశాస్త్రమునందలి కొన్నిపదములు భావ ప్రధానములై యున్నవి. కేవలము వాచ్యార్థమునే చెప్పవు. ఆ శ్లోకమున నిశయనగా రాత్రికాలమని అర్థము కాదు, రాత్రివంటి అజ్ఞానము, లేక అవివేకము అని అర్థము. అట్లే జాగరితపదమునకు మెలకువయని యర్థముకాదు. వివేకమని అర్థము. అది పగటి కాలమువంటిది.

వి - అజ్ఞానమును జెప్పవలెనన్న యజ్ఞానపదమునే వాడవచ్చునుగదా ?

కృ - రాత్రివంటిదని వాడుటలో నొక యందమున్నది. రాత్రికాలమున చరించువారు రాక్షసులు. వారికి నక్తంచరులని పేరు. అసురులు. అసుషు-రమన్త ఇత్యసురాః. శరీరమునందాత్మబుద్ధి కలవారు, యథార్థమును గుర్తెరుగక భోగలాలసులైనవారు, ఎవరికి ఆత్మ తత్వము తెలియదో వారు అసురులు, రక్కసులు, నిశాచరులు అగుదురు. అందుకని అజ్ఞానము రాత్రివంటిదని వర్ణింపక రాత్రియే యనుటలో ఆపదమునకొక యలంకారమైనది. ఆత్మజ్ఞానము సామాన్య జీవులకు అనగా ప్రపంచాభిముఖులకు రాత్రివంటిది. అందువారు చరించరు. వారా జ్ఞానపట్టమును గుర్తెరుగకుండ నిద్రపోవుచున్నారు. ఆపట్టమున మెలకువగలిగినవారు మునులు. కాని ఆమునులు అజ్ఞాన జన్యమగు సంసారమను రాత్రియందు నిద్రపోవుచున్నారు. అనగా దాని తెరువునకు రారు. కావున ఒక భాగమున నిద్రబోవువారు మరొకభాగమున మేలుకొందురు. అర్థమైనదా ?

వి - చక్కగా అర్థమైనది. అజ్ఞుల ప్రపంచము రాత్రి వంటిది కనుక వివేకులా రాత్రికాలమున చరింపరు. విజ్ఞుల ప్రపంచము అజ్ఞులకు రాత్రివంటిది కనుక అజ్ఞులు దీనియందు చరింపరు. ఒకరు ప్రాఙ్ముఖులును ఒకరు పశ్చిమాభిముఖులును.

కృ - కావున, భావమే సామాన్యమానవులకును సమాధి నిష్ఠులకును భేదము. తరువాత ?

వి - స్థిత ప్రజ్ఞులను మాట కర్థమేమందురు ?

కృ - నేనేపరబ్రహ్మము అను దృఢనిశ్చయము కలవారు స్థిత ప్రజ్ఞులు.

అహమస్మి పరబ్రహ్మేతి ప్రజ్ఞా యస్య స స్థిత ప్రజ్ఞః శం.భా

వి - సమాధిపదమునకు?

కృ - సమాధి శబ్దమునకు ఆత్మయని యర్థము. "సమాధీయతే చిత్తం అస్మిన్నితి సమాధిః" చిత్తమెక్కడ లయమగునో యదియే సమాధి. ఏదైనను దేనికి యేది అధిష్ఠానమో దానియందే యది లయమగును.

చిత్తము (మనస్సు) అనునదియు ఉదయించుటకు ఆత్మయాధారము గాన కలయస్థానమును నదియే. సముద్ర తరంగములు సముద్రము నుండియే పుట్టి, అందే పెరిగి మరల అందే లీనమగును. కావున సమాధి శబ్దమునకు ఆత్మయని యర్థము.

వి - అసలు తరంగమెట్లు వచ్చుచున్నదందురు ?

కృ - వాయుస్పందనమున. ఆ స్పందనము కలిగినప్పుడు సముద్రోదకమునకే తరంగమని పేరు వచ్చినది. తరంగము వేరై పుట్టలేదు. కావుననే చిత్తము వేరై ఆత్మయందు లీనమగుట జ్ఞాన సమాధి కాదు. ఈ యభ్యాసమున సమాధినిష్ఠుడు కేవలము మౌనియై కాయిక వ్యాపారము లేక యుండడు. ఉండవలెనన్న నియమము

లేదు. సమాధి కదీ లక్షణము కాదు. శరీర ధర్మములన్నియు నడచు చుండును. దీనినే గీతాచార్యులు 5వ అధ్యాయము 8-9 శ్లోకముల వర్ణించిరి. స్వాభావికమగు ఇంద్రియ వ్యాపారము ఆత్మ వ్యాపారము కాదు. తత్వవిదులగువారు నేను నిష్క్రియుడననిభావింతురు.

శ్లో॥ నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్గచ్ఛన్
స్వపన్ శ్వసన్
"ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్"

తత్వవిదులనగా ఆత్మవిదులని యర్థము. ఆత్మకంటె వేరు పదార్థము లేదని ప్రపంచమును దేహాదికములను గూడ చూడగలుగుటే యీ యోగమున సమాధి. అనగా భూషణములు బంగారమునకంటె వేరుగానట్లు కారణమగు నాత్మకంటె కార్యమగు జగత్తు వేరుకాదను దృష్టియే సమాధి.

శరీరేంద్రియములు చలించక కాష్ఠాకారము నొందుట సమాధి కాదు.

క. తనుదాగానని మనుజుని
మనము విరోధింపఁబడక మసలుచు దిరుగున్
దనుదాఁగను సత్పురుషుని
మన మానందబ్ధిమందు మగ్నతనొందున్.

గీతాశాస్త్ర మీ విషయమును సుస్పష్టము గావించినది.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 2-59

ఇంద్రియముల కాహారము విషయములు. ఆ విషయములు ఇంద్రియముల యొద్దకు రావంతవరకు అనగా బలాత్కారముగ శబ్దాది విషయముల నరికట్టినంతవరకు రూపు మాపినట్లుండును? కాని నిర్బీజముగా మనము వదలలేము. వేయించిన గింజ మొలవదు. వేయించిన గింజలో ప్రరోహణశక్తి సూక్ష్మరూపమున నుండును. అట్లే ఇంద్రియములను, విషయవాసనలను బ్రహ్మజ్ఞానికి నిర్బీజముగా నశించినట్లు కేవల హఠయోగ సమాధియందు నశించవు. ఒక మహానుభావుని యనుభవ వాక్యమిది.

మ॥ పవిత్రానందన చందనాది విషయ వ్రాతంబులం బొంది చ
యన వంతంతకు జొక్కు నెమ్మనము బ్రహ్మానంద వారాశి వా
సన మొక్కించుక సోకెనేని ప్రవినాశం బొందు నానాద్రుమ
ప్రసవోద్యద్భృంగము చంపకప్రసవ సంస్పర్శాప్తికూలం గతిన్

విజయా ! తుమ్మెద సర్వపుష్పముల యందును తిరుగునదియైనను సంపెంగ పువ్వుయొక్క వాసన తగిలినతోడనే మృతి జెందునట్లు ఈ మనస్సుకూడ దారాపుత్రులు, చందనాదికముల విషయముల ననుభవించుచు నానందించునదియైనను బ్రహ్మానంద సముద్ర వాసన ఇంచుకమైనను సోకినచో తక్షణమే నశించును. అనగా అభావరూప మగునని యర్థము. ఆ రెండు పద్యములను గూడ గ్రహింపుము.

క. చక్కెరయును లవణంబును
గ్రక్కున నుదకములయందు గరగిన భంగిన్
మిక్కిలి తనుగను ఘనమది
చొక్కుచు నానంద జలధినుడిసి నశించున్.

శా. నానాకర్మజ వాసనాన్విత మనోనాశంబు గాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్పు డి
య్యానందాంబుధి నోలలాడకయ బాహ్యాభ్యంతరార్థాను సం
ధానోద్భూత నితాంత దుఃఖమయ సంతాపంబు చల్లారునే.

దీనినే అమనస్కమని వాడుదురు. కావున యోగ సమాధివంటి
దీనినే అమనస్కమని వాడుదురు. కావున యోగ సమాధివంటిది కాదీ జ్ఞానసమాధి. యోగదర్శనమున పదార్థము ఒక్కటి గాదు. అది ద్వైతమును చెప్పను. అందువలన యోగదర్శనమును ధ్యానాంగముగ మాత్రమే శంకరులు గ్రహించినారు.

శ్లో॥ "సమ్యగ్దర్శనా భ్యుపాయత్వే నైవ యోగోంగీక్రియతే"
2. అ; 1 పా యోగప్రత్యుక్త్యధికరణము.

వి - మరి గీతయందర్జునుడు స్థితప్రజ్ఞుని గురించి ప్రశ్నించునప్పుడు కాయిక వాచిక వ్యాపారములను గురించి కూడ కా భాషా ? కిమాసీత? కథం వ్రజేత ? అని ప్రశ్నించినాడే! 2. అ. 54 శ్లో.

కృ - నిజమే. లోకమునందొక విశిష్ట పురుషుని గాని లేక, ఎవ్వరినైనను గుర్తెరుగవలెనన్న ఆ పురుషుని కాయిక వాచిక వ్యాపారములను సాధనములనుగా గ్రహించుట సామాన్య న్యాయము. ఆ న్యాయము ననుసరించి ఆ ప్రశ్నలు పుట్టినవి. అంతేకాక సిద్ధలక్షణములే సాధకునికి సాధన భాగములను విషయము కూడ మన శాస్త్రములందు చాల ముఖ్య విషయము.

"సర్వ త్రైవహి అధ్యాత్మ శాస్త్రే కృతార్థ లక్షణాని యానితాన్యేవ
"సాధనాన్యుప దిశ్యంతే యత్న సాధ్యత్వాత్ (శం. భా.)

అంతమాత్రముచేత కదలక మెదలక కన్నులుమూసి కూర్చున్న వారందరును, జ్ఞానవిష్ఠులైరని నిర్ణయము లేదు. అణిమాది సిద్ధులను గూడ జ్ఞాని కలిగియుండునను నియమము లేదు. అది హఠయోగములోని భాగము. ముక్తి రెండు విధములు. జీవన్ముక్తియనియు, విదేహముక్తి యనియు. జీవన్ముక్తుడును అతడుండు భూమికల ననుసరించి నాలుగు పేర్లతో పిలువబడును. 1) బ్రహ్మవిదుడు, 2) బ్రహ్మవిద్వరుడు, 3) బ్రహ్మవిద్వర్యుడు, 4) బ్రహ్మవిద్వరిష్ఠుడు. వీరు నలుగురును బ్రహ్మనిష్ఠులే. వీరి చిత్తము వసించు విధానమును బట్టి వీరికీ తరగతులు నిర్ణయింప బడినవి.

జ్ఞాన భూమిక లేడు. 1) శుభేచ్ఛ. శుభమనగా మోక్షము. ఆ మోక్షము కావలెనను కోరిక. 2) విచారణ. తను కోరిన మోక్షము కొరకై వైరాగ్యాదులను సంపాదించుకొనుట, సత్పురుష సహవాసము, మొదలగునవి కలుగుట. 3) తను మానస : పై రెండు భూమికలు సుస్థిరము కాగా ఆ రెంటి ప్రభావము వలనను వైరాగ్యము దృఢమై వాసనలు సన్నగిల్లును. వాసనలే మనస్సు. అవి సన్నగిల్లగా ఆ భూమికకు తను మానసయను పేరు వచ్చినది. ఈ మూడు సోపానములను నధిరోహించిన వానియొక్క మనస్సు వేర్వేరు విషయములను సంకల్పింపజాలదు. సంకల్పము లను నవియే పోవును. ఆ మనస్సు పరబ్రహ్మమునందే నిలుచును. ఈ భూమిక నుండి సమాధియను పేరు వచ్చును. ఈ భూమికకు "సత్వాపత్తి" యని పేరు. ఇది నాల్గవది. సత్వమనగా ఉనికి. ఉనికి యే స్వరూపముగా గలది. బ్రహ్మము లేక ఆత్మ.

ఆ బ్రహ్మమును లేక ఆత్మను సమాధి నిష్ఠచే బొందుట సత్వాపత్తి. ఇందు చిత్తము క్షీరనీరములవలె ఆత్మయందు లయమగును. అక్కడ త్రిపుటి నశించును. త్రిపుటి (ధ్యాత,ధ్యానము, ధ్యేయము) ఈ భూమికయందున్నవానికి బ్రహ్మవిదుడని పేరు. దీనిని నిర్వికల్ప సమాధి యందురు.

సర్వాధిష్ఠాన సన్మాత్రరూపే ఆత్మని క్షీరోదక వత్త్రిపుటీ లయేన సాక్షాత్కార పర్యంతా యాస్థితిః నిర్వికల్పక సమాధిరూపా సా సత్వాపత్తిః "వాశిష్ఠము" 118 స.॥

పై భూమికలు నాలుగును దృఢము కాగా పరులు ప్రేరేపించిననే గాని ఆ సమాధినుండి మేల్కొనని స్థితి వచ్చును. ఇందు అజ్ఞాన సంబంధమును, దాని కార్యములును తొలగును. అందుచే నీ భూమికకు "అసంసక్తి" యని పేరు. ఈ భూమికయం దుండువాడు బ్రహ్మ విద్వరుడు. ఇది అయిదవది. ఆరవ భూమికకు వెళ్ళగా అతనికి రెండవ పదార్థమే భాసింపదు. పరులు వానినెంత ప్రబోధించినను అతడా జ్ఞాన సమాధినుండి మెలకువ నొందుటయే కష్టమగును. ఏదో యొక కాలమునందు మాత్రమే కన్నులు తెరచును. ఈ భూమికకు పదార్థభావన అని పేరు. ఈతనిని బ్రహ్మ విద్వరుడు అందురు. పైన వర్ణితములైన ఆరు భూమికలను చిరకాల మభ్యసింపగా భేదమను పదమే అతని వాఙ్మయము నందుండదు. అది స్వస్వరూప స్థితియై తుర్యగయను పేరు నొందును. ఇతడు బ్రహ్మవిదాదులలో నాల్గవవాడు. వీనికి బ్రహ్మవిద్వరిష్ఠుడని పేరు. ఇది ఏడవ భూమిక. మోహాత్మకములగు జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడింటిని, విశ్వతైజస ప్రాజ్ఞులను మువ్వురు జీవులను,

విరాట్పురుష, హిరణ్యగర్భ అంతర్యాములను ఈశ్వర రూపములను, దాటినది గనుక దీనికి తుర్యగ అని కూడ పేరు. దీనిని భూమికలో చేర్చినను దీనికి ముక్తావస్థయనియే తత్త్వవిదుల నిర్ణయము. ఈ భూమికయందున్నవారిని పరులెంత ప్రేరేపించినను మేలుకొనరు. శిలవలె నుందురు. వీరందరు జీవన్ముక్తులు.

వి - ఎప్పటికైనను మరి వీరికి ప్రాణోత్క్రమణ ముండునా?

కృ - యథార్థమునకు ప్రాణోత్క్రమణ మనునది లేదనియే వ్యాసహృదయమని శంకరులు నిర్ణయించిరి. వ్యాస సూత్రములలో అ.4 పా 2. ప్రతిషేధాధికరణమున 12, 13, 14. సూత్రములయందు బ్రహ్మవిదునకు ప్రాణోత్క్రమణ మున్నదా? లేదా? అను విషయము చర్చింపబడినది. 12వ సూత్రమున ఉన్నదని పూర్వపక్షమును చెప్పి మిగిలిన "స్పష్టో హ్యేకేషామ్" స్మర్యతేచ॥ అను రెండు సూత్రములను బ్రహ్మవిదునకు ప్రాణోత్క్రమణ లేదని నిర్ణయించినవనియే శంకరులు సిద్ధాంతీకరించిరి.

"న తస్య ప్రాణా ఉత్క్రామన్తి ఇహైవ సమవలీయన్తే" అని ఉపనిషత్తులు.

"న చ బ్రహ్మవిదః సర్వగత బ్రహ్మాత్మభూతస్య ప్రక్షీణ కామకర్మణః ఉత్క్రాంతిర్గతిర్వోపపద్యతే నిమిత్తాభావాత్॥

ఇట్టి జీవన్ముక్తులనే గీతా శాస్త్రము స్థితప్రజ్ఞులనియు, భక్తులనియు, త్రిగుణాతీతులనియు వర్ణించినది. ఈ భూమికలలోని జ్ఞానులు కర్మలను చేయుదురు. సామాన్య మానవుల నుద్ధరించుటకై భూభాగముల చరింతురు, చరింపకుందురు. దేవాలయముల నిర్మిం

తురు. నిర్మింపకుందురు. రాజ్యములను కూడ నేలుదురు గృహస్థులైకూడ నుందురు. సన్యాసులుగను, అవధూతలుగను గూడ చరింతురు. దిగంబరులై విగూఢ ప్రకాశమున పామర జనుల మధ్య యందుగాని, అరణ్యములలో క్రూర మృగముల మధ్య యందుగాని నిర్భీతులై నిష్కర్ములై చరింతురు. వీరివర్ణనల గీత 2వ అధ్యాయమున 55,56,57,58 శ్లోకములచే వర్ణించినది.

శ్లో॥ ప్రజహాతి యదాకామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞ స్తదోచ్యతే॥ 2-55

మానవ జీవితమున ఆత్మ తృప్తియే చరమలక్ష్యము. తృప్తివలన కలుగునదే యానందము. ఆ యానందము రెండు విధములు. ఒకటి సాపేక్షకము రెండు నిరపేక్షకము. సాపేక్షక మనగా వేరొక వస్తువు వలన కలుగు ఆనందము. నిరపేక్షకమనగా వేరొక పదార్థముతో పనిలేకయే కలుగు నానందము. సామాన్య మానవుడు అనగా స్థితప్రజ్ఞుడు కానివాడెవ్వడైనను సాపేక్షానంద మునే కోరును వాడుకోరుకొను నానందమునకు అవలంబనము కాంత కావచ్చును. లేక ధనము కావచ్చును. భోగపదార్థములేవైనను కావచ్చును ఏవియే ఆనందము కలుగుట కేది కారణమైయుండునో యావస్తువు సంప్రాప్తింపక పోవుటగాని, లేక ప్రాప్తించియు నష్టమగుటగాని, నష్టము కాకపోయినను తనకు వ్యతిరేక ఫలము నొసంగుటగాని, జరుగుచుండుట లోక సహజము. అప్పుడా వస్తువులను కోరిన కర్త ఆయానందము నెట్లనుభవించును? ఆనందము ప్రాప్తింపక పోగా దుఃఖము తప్పదు.

రెండవది నిరపేక్షికము. ఆ యానందము రావలెనన్న వేరొక వస్తువుతో నెట్టి సంబంధమునులేదు. ఆయానందమున కాలంబనము

తానే. అది గుర్తెరిగినవాడే స్థితప్రజ్ఞుడు. దానినే యాతడనుభవించును. ఆత్మలోని యానందమే విషయరూపమున వెలువడుచున్నదిగాని యంతకంటె వేరుకాదని యతడు భావించును. కోరికయే దుఃఖమూలమని యాతడెరుగును. ఈ రహస్యము తెలియుటయే భారతీయుత. లేక ఆత్మజ్ఞానము. లేక ఏకాంతభక్తి. కోరిక యనునది త్రిగుణములకు సంబంధించినది. కోరికలు నిశ్శేషముగ నశించిపోవుట త్రిగుణాతీతత్వము. కోరికలు క్షయముకాగా మనస్సనుమాట ఎక్కడిది? మనస్సునకు స్వరూపము ఇచ్ఛ.

క. నీమూలందే నెరిగితి గామమ
సంకల్పము ననగలిగెదు సంక
ల్పా మర్మరహితమగు చే
తో ముద్రం దాల్తు నేను దుదియదనీకున్ — భా.శాం.ప.

మంకియను నొక బ్రాహ్మణుడు చెప్పినగీతమిది. ఇదియే మంకిగీత యనుపేర వర్ణింపబడినది భారతమున.

మంకియను నాతడొక బ్రాహ్మణుడు. అతడు ధనమును సంపాదింపనెంచి రెండు కోడెదూడలను విక్రయమునకై గ్రామాంతరమునకు గొనిపోవుచుండెను. అతని పయన మొక యడవిమధ్యనుండి సాగినది. ఆ దూడలను రెంటిని జంటచేసి యొక గట్టిత్రాటను బిగించి కట్టి, తోలుకొని పోవుచుండెను. దైవ సంఘటనల నెవ్వరెరుగును? ఆ రెండును పోవు త్రోవ మధ్యనే యొక ఒంటె పరుండినది. ఆ రెండు దూడలును పరువులెత్తుచు వచ్చి ఆ ఒంటెపై నొరిగినవి. ఒంటె పైకి లేచినది. అది ఒంటెకాదు. అకోడెలకు కాల

మృత్యువు. ఈ బ్రాహ్మణునకు వైరాగ్యము నందింపవచ్చిన గురువర్యులు కావచ్చును. ఆ ఒంటెపై నటునిటు రెండు దూడలును వ్రేలాడగా మెడకు కట్టిన యాదృశరజ్జువే మృత్యువైనది. గోవత్సములు రెండును మృతినొందినవి. ఆ సందర్భమున నా బ్రాహ్మణు డర్థము చేసికొనిన యంశమన్న మాట. ఓ కామమా! నీయంత్య కాలము రావలెనన్న నీమూలము నశించవలెను. నీకు మూలము సంకల్పము. ఇదిగో ఆ సంకల్పములనే వర్జించుచుంటినని యమనస్కుడయ్యెను.

విజయా! శరీర పోషణమాత్రమునకైనను జ్ఞానియగువాడు ధన తృష్ణనొందవలెనా? అను ప్రశ్నకు శరీర పోషణమనునది కూడ ప్రారబ్ధాధీనము గావించుచు ధన త్యాగము చేయుటయే యవసరమని ఈ కథ చెప్పుచున్నది. ఒక్క ధనకాంక్షయేకాదు. "సర్వాన్ కామాన్" అని శ్లోకమునందున్నది. ఇట్టి స్థితప్రజ్ఞుడే కుచేలుడు. ఈతడనుభవించునదీ ఆత్మానందమే. "ఆత్మన్యే వాత్మనా తుష్టః"

వి - ఆత్మ శబ్దములు రెండున్నవే ?

కృ - అవును. ఇచ్చట ఆత్మ శబ్దములకు రెంటికిని ఒకే అర్థము. సచ్చిదానంద బ్రహ్మమై వెలసిన ఆత్మయందే తాను ఆనందించును. ఇంతకు పూర్వము అంతఃకరణ వృత్తులు ఈతనికి బాహ్యవస్తువుల నుండి ఆనందము నందించగా యిప్పుడా వృత్తులు మరలి ఆత్మ యందే ఆనందించుచున్నవి. బాహ్య వృత్తులు లేవని భావము.

శ్లో॥ దుఃఖేష్వ నుద్విగ్నమనా స్సుఖేషు విగత స్పృహః
వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే॥ 2-56

ఎట్టి దుఃఖము లీతని వరించినను నీతని మనస్సు క్షోభ చెందదు. రాగము, భయక్రోధములును నీతని దగ్గరకుకూరావు విస్తరంగ సముద్రమువలె గంభీరుడై తిరుగుచుండును.

వి - స్థితప్రజ్ఞుడై తిరుగు మహనీయుని చరిత్ర నొక్క దానిని యుదహరింప ప్రార్థన.

కృ - జడభరతుని యుపాఖ్యానమిందుకు చక్కని యుదాహరణము. అతడు ప్రథమమున రాజర్షి. తరువాత విప్రుడై జన్మించెను. ఈ జన్మయం దాతడు సంగరహితుడు. ఇంతతో నాతని కీ శరీర సంబంధములు సమాప్తము కావచ్చును. శరీర ధర్మము లాతని బాధింపవు. చలిబాధలేదు, ఎండకు క్రుగ్గడు. వాన లాతని తడపవు. అతడు సోదరులిచ్చిన ఆజ్ఞకు బద్ధుడై ఒక పంట భూమికి కాపరియై యుండెను. ఆహారాదికములా?

తే॥ అతుల మృష్టాన్నమైన శుష్కాన్నమైన
నెద్ది వెట్టిన జిహ్వకు హితవుగానే
దలచి భక్షించు గాకొండు దలచి మిగుల
బ్రీతి సేయుడు రుచులందు బ్రీతితోడ.

ఆ మహనీయున కొకనాటి సన్నివేశము. రాజభటులు కొందరా మహనీయుని పట్టుకొని భద్రకాళికి నరబలి నిచ్చుటకై కొనిపోయిరి. బలినొసంగు పశువునకు తలంటుట మధురాహారంబుల నొసంగి నూతన వస్త్రములగట్టుట యాచారము. కాన నా వ్యాపారమంతయు నా విప్రోత్తమునకు జరిగినది. ఇంతవర కాతడు రాజభటులను పలుకరించనైనను పలుకరింపలేదు. ఇక నా భూసురుని రక్తమును భద్రకాళికి సమర్పింపవలెను. రాజభటులు భద్రకాళి యాలయ

ప్రాంగణమువకు మంగళవాయిద్య ఘోషములతో నాతనిని కదలించిరి. మేళములతోడనే భద్రకాళికి సమ్ముఖమున కూర్చుండబెట్టిరి. తరువాతి కృత్యము బలిప్రదానము. కాళీ మంత్రముచేత నభిమంత్రితమైనది ఖడ్గము. ఒక్కవ్రేటున నాతని శిరము కాళి ఎదుట పడవలెను. విజయా! భద్రకాళిశరీరము గజగజ లాడినది. సర్వాత్మభూతుడగు బ్రాహ్మణోత్తముని బలిగొనుసమర్థత దేవతలకులేదు. దేవతలందరును బ్రహ్మీభూతునకు పాయసముల సమర్పించు సామంత రాజులని తైత్తిరీయోపనిషత్తు వర్ణించినది. కాళిక కత్తి ముఖమై యున్న సమయమున యా బ్రహ్మనిష్ఠు డిట్లు భావించి యుండెనట.

ఉ॥ అప్పుట విప్రసూనుడు భయంబొక యించుక లేక చంపగా
వచ్చిన వారియందు గరవాలము నందును గాళియందు దా
నచ్యుత భావముంచి హృదయంబున బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండెనెంతయున్

ఇట్టివి స్థితప్రజ్ఞుని చర్యలు. ఈతడే ఒకప్పుడు రహూగణుడను రాజునకు పల్లకిని మోసెను. తత్త్వముకూడ నుపదేశము చేసెను.

## జ్ఞానికర్మ

వి - ఇటువంటి స్థితప్రజ్ఞులు వేదోక్తములగు కర్మల నెప్పుడు నాచరింపరా ?

కృ - ఆచరింపకేమి? ఆ కర్మ కూడ వారికి సమాధియే.

వేదోక్త కర్మలయందుండు సామగ్రి యంతయు వారికి బ్రహ్మాకారమయియే గోచరించును. ఆ కర్మయందు వ్రేల్చబడు అగ్ని

బ్రహ్మాగ్ని. హోమముచేయు స్రుక్ స్రువములు కూడ బ్రహ్మమే. హోమ ద్రవ్యమగు చరుపురోడాశములు, హోమము చేయుటయను క్రియయు, చేయు కర్తయు కూడ బ్రహ్మ వస్తువుకంటె భిన్నము కాదు. ఇందు యజమానుడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను పరిపూర్ణ భావముచే లోక సంగ్రహమునకై కర్మల నాచరించును. ఇదియే జ్ఞానికర్మ.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా. 4. 24

ఈ బ్రహ్మవిదుల సంసార యాత్రయు నంతియె. తత్వవిదులగు రాజర్షులందరును యీ తెగకు జెందినవారే. వశిష్ఠ మునీంద్రుని సంసారమంతయు బ్రహ్మవిదుని గృహస్థాశ్రమమే. శుక యోగీంద్రులెట్టివారో వశిష్ఠులును అట్టివారే. కొందరు పెద్ద లీ క్రింది శ్లోకమును చెప్పుదురు.

శ్లో॥ కృష్ణో భోగీ శుకస్త్యాగీ నృపౌ జనక రాఘవౌ
వశిష్ఠః కర్మకర్తా చ పంచైతే జ్ఞానినస్మృతాః॥

శ్రీకృష్ణులు భోగియై జ్ఞానిగాను, శుకులు త్యాగియై జ్ఞానిగాను, జనక రాఘవు లిద్దరును సామ్రాజ్యాధిపతులై జ్ఞానులుగాను, వశిష్ఠులు గార్హస్థ్య కర్మల నిర్వర్తించుచు జ్ఞానులుగాను చరించిరి. అందు భావమే ప్రధానము.

వశిష్ఠులు శ్రీరామచంద్రునితో తన కర్తవ్యమును గూర్చి యిట్లు చెప్పెను.

శ్లో. కర్తవ్య మస్తి న మమేహ హి కించిదేవ
స్థాతవ్య మిత్యపి మనా భువి సంస్థితోస్మి.
సంశాంతయా సతతసుప్త ధియేహ వృత్యా
కార్యం కరోమి న చ కించిదహం కరోమి.

రామచంద్రా! నేను ఆచరించు క్రియలకు ప్రయోజన మేమియును లేదు. ఫలము నపేక్షించి చేయను. అందువలన నాకు చేయవలసిన కర్మలు నిర్ణీతములై లేవు. కారణమేమి? నేనీ శరీరము కలిగి భూమిపై చరించుచున్నను నాకు మనస్సనునది లేదు. అమనస్కుడనయ్యే యుందును. ఇది సంభవమా? అని సంశయింపకు. నిద్రావస్థలో (గాఢనిద్ర) బుద్ధి వృత్తులుండవు గదా? అవి లయమై యుండును. అట్లే జాగ్రత్తునందు కూడా బుద్ధివృత్తులు శమించగ నేను చేయు కర్మలన్నియు శమించియే యుండును—ని క్రియలు ఫల రూపములుగావు. అజ్ఞుల దృష్టిలో నవి కర్మలు కానవచ్చును. నా కవి బ్రహ్మాకారవృత్తులు అని చెప్పెను. ఇదియే శ్రీకృష్ణుల జన్మ కర్మలయందలి దివ్యత్వము. శ్రీకృష్ణుల జన్మ కర్మలలోని దివ్యత్వ మెరింగిననే జీవుల జన్మ కర్మలు తొలగును

శ్రీకృష్ణుని అవతారము వచ్చినదివలె నగుపించును. అతడు దేహధారివలె కనుపించునేగాని ఆ రెండును యథార్థములు కావని శంకరులు సిద్ధాంతీకరించిరి. "స్వమాయయా దేహవానివ జాత ఇవచ"
శం. భా.

వారి రాసక్రీడయు, గోపికా బృందములును ఇట్టివే. యథార్థమునకు పండితులనువారు వీరే. భిన్న ప్రపంచమంతయు అభిన్నము, అఖండము నగు బ్రహ్మమై కనబడుటే పాండిత్యము. పండిత శబ్దమునకు లక్షణ పరిష్కారమును చేసినది గీతా శాస్త్రము.

వి - "విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః॥ 5-18

ఇదియేనా ?

కృ - ఇదియే.

వి - ఒక్క సందేహము. ఈ శ్లోకమును చాలామంది చదివి అందరిని సమానముగా చూచుటయే పండిత లక్షణమనుచూ ఉపన్యసింతురు. అందరను సమానముగా చూచుట కుదురునందురా?

కృ - వారు చెప్పునది శ్లోకార్థము కాదు. భావార్థము కూడా కాదు. అది "ర్థము" లేక వ్యర్థము. ఈ శ్లోకమునందు సమమను పదమునకు సమానమని అర్థము కాదు. కర్మ, అకర్మ, నిరాశబ్దముల వలెనే యీ సమ శబ్దమునకు ప్రత్యేకమగు సంజ్ఞ యున్నది. ఇక్కడ సమ శబ్దమునకు పరబ్రహ్మయని అర్థము. సమముగా చూచుట అని అర్థము కాదు. క్రియా విశేషణము కాదు. సమ శబ్దము యీ శ్లోకమున కర్మగా వాడబడినది. సమమును చూచువారు (రే) పండితులు అని అర్థము. చూచు ధాతువు సకర్మకము. సమశబ్దమును క్రియకు విశేషణముగ చేయుచో కర్మ లోపించును. సమశబ్ద మిందు సమాసములోనిమాట. "సమం (బ్రహ్మణం) పశ్యతీతి సమదర్శి" అని అర్థము. పండితులు బ్రహ్మమును చూతురు. ఎట్లు చూతురు? విద్యావినయములతోకూడిన బ్రాహ్మణునియందును, గోవుయందును. కుక్కయందును, కుక్కను తినువానియందును అందరి యందును ఏకాకారమై వెలుంగు బ్రహ్మను అఖండమైనదానినిగా పండితులు దర్శింతురని చెప్పిరి.

"అస్పృష్టం, సమం ఏకం అవిక్రియం బ్రహ్మద్రష్టుం శీలం యేషాం తే పండితాః సమదర్శినః" (శం. భా.) సమశబ్దమునకు సమానమను అర్థము చెప్పువారు భార్యను తల్లిని సమానముగా చూతురా? నేడు సమానత, సామ్యము అను వాడుక పదములు, రాజకీయ పారిభాషిక పదములు. పామరులకు, భారతీయ సిద్ధాంతములు చీకట్లయిన వారికిని చెప్పుమాటలవ్వి.

వి - చిత్తము. త్రిగుణాతీతుల వర్ణనముకూడ స్థితప్రజ్ఞులవంటిదే వంటిరిగదా?

కృ - అవును. కాని భారతీయ వేదాంతమున అవధూతలు, అజగరవ్రతులనువారు వర్ణింపబడియుండిరి. వారిని గురించి కొంత చెప్పవలసియున్నది. ఇది పైన చెప్పిన బ్రహ్మవిదుల విభాగము లోనిదే.

వి - వారినికూడ మన గీత వర్ణించినదా?

గీత వర్ణించని విషయమేలేదు. బ్రహ్మ విదులలో ఒక తెగవారికి లోక సంగ్రహముకొరకు కర్మచేయు భావముండును. రెండవ తెగ వారికి లోక సంగ్రహార్థమగు ప్రవృత్తి యుండదు.

శ్లో. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ
నవద్వారేపురే దేహీ నైవకుర్వన్న కారయన్. 5-13

ప్రారబ్ధ శరీరమునందుండి నిత్యనైమిత్తికాది కర్మలను గూడ సన్న్యసించును. ఏకర్మను, తాను చేయడు పరికదా మరి యొకరిచేతను చేయించడు.

నైవకుర్వన్ న కారయన్.

శ్లో. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్యచాప్రియం
స్థిరబుద్ధిరసం మూఢో బ్రహ్మ విద్బ్రహ్మణి స్థితః" 5-20

సర్వకర్మ సన్యాసులైన ఆత్మవిదులను ప్రియము అప్రియము అను నవి కలతనొందించవు. అతడు సర్వకర్తవ్యతా శూన్యుడై బ్రహ్మ వలోకమునందే రమించుచుండును.

వి - వీరు జనమధ్యమం దుండక ఏకాంతవాసమునకై వెళ్ళరేమో ?

కృ - విజన ప్రదేశమే ఏకాంతవాసముకాదు. జనులు తిరుగాడని దేశమే ఏకాంతమను భావము వీరికిలేదు. వీరి దృష్టియం దేకాంతమన బ్రహ్మమే

"ఆదావంతే చ మధ్యే చ జనోయస్మిన్న విద్యతే
యే నేదం సతతం వ్యాప్తం సదేశో విజనస్మృతః
అపరోక్షానుభూతి 110 శ్లో.

సర్వవ్యాపకమగు బ్రహ్మములేనిచోటు లేదుగదా ?

జీవన్ముక్తుడగు జ్ఞానయోగికి విశ్వమంతయు బ్రహ్మమయము కాగా విశ్వమందలి భాగమేదియును నాతని వ్యామోహము నొందించలేదు. అతడరణ్యములం దుండుట యెట్టిదో పత్తనములు వానికట్టివే. బ్రహ్మజ్ఞానుల సభలెట్టివో బాలబాలికా బృందమును అట్టిదే. జీవ న్ముక్తులగు వారిని శంకరులు వర్ణించినారు.

శ్లో॥ కదాచిత్ ప్రాసాదే క్వచిదపి చ సౌధేషు ధనినాం
కదాకాలే శైలే క్వచిదపి చ కూలేషు సరితాం
కుటీరే దాన్తానాం మునిజన కరాణామపి వసన్
మునిర్న వ్యామోహం భజతిగురు దీక్షాక్షతతమాః॥

గురుకటాక్ష పాత్రుడైన ముని మేడలయం దొకప్పుడుండును. ధన వంతుల గృహములుకూడా అతనికి విహారస్థలములు కావచ్చును.

మరొక సమయమున పర్వతరాజముల చరించుటకూడా కలదు. నదీ నదములందుండు ఇసుక తిన్నెలతనికి సింహాసనములై యుండును కూడ. లేక కొందరు కుటీచక బహూదకులగు యతుల గృహము లను నాతనికి నిలయములే. మునుల పర్ణకుటీరములు తనకు మిత్రస్థానములుగ నుండును. ఇట్టి ప్రదేశములను నియామమా తనికి లేదు. వ్యామోహము మాత్రము అతనిదగ్గరకు రాదు. అంతేకాదు. విషయము లన్నియు అతని వెంటరావచ్చును గాని, ఆ విషయానందములు మాత్రము వేరుగాక భూమానందమున మునిగి అతని ఆనందమునవే లీనమగును.

వి - భూమానందమను క్రొత్తపదమును వాడితిరే.

కృ - భూమాయన్నను బ్రహ్మమే.

వి - త్రిగుణా తీతుని లక్షణములనుకూడా గీతాశాస్త్రమెట్లు చెప్పినదో వర్ణింపుము.

కృ - ప్రకాశం చ ప్రవృత్తించ మోహమేవ చ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥ 14—22

త్రిగుణాతీతులనగా గుణములకు బద్ధులు కానివారని యర్థము. సత్వగుణము, రజోగుణము, తమోగుణము అను త్రిగుణములను ఆత్మను కప్పును. గ్రహణము పట్టినప్పుడు సూర్యచంద్ర మండలములను రాహువు ఆచ్ఛాదించినట్లు ఆత్మను ఆచ్ఛాదించును. (కప్పును)

వి - మాయ గదా ? కప్పునది ?

కృ - త్రిగుణములేగదా ? మాయ ? మాయ అన్నను త్రిగుణములన్నను ఒక్కటే, ఒక్కొక్క గుణము ఒక్కొక్క ప్రవృత్తి కలిగి

యుందును. ఆ గుణములతో ఆత్మచైతన్యము కలవగా అనగా సంబంధము రాగా స్ఫటికమణి వద్దనున్న మందారపుష్పమువలన స్ఫటిక మణికివచ్చు ఎరుపు దనమువలె గుణసాన్నిధ్యమున ఆత్మకు గుణ సాంగత్యము వచ్చును. అట్టి సంబంధము కలిగినప్పుడు ఆత్మ కర్తయగును. ఆ గుణసంబంధము తొలగుటయే గుణములను అతిక్రమించుట.

గుణములు తొలగుటయనగా నాగుణముల మిధ్యాజ్ఞానము. ఆ గుణ సంకరమెప్పుడును నాత్మకు కలుగలేదు. ఆత్మను ఆ గుణములు ఆచ్ఛాదించిన సమయమునందుకూడ ఆత్మ తన స్వరూపమును కోల్పోవలేదు. ఆరోపణ మెప్పుడును వస్తువును మార్చదు. నాటకరంగమున వేషమును వేయు పురుషుడు స్త్రీ వేషధారియైన మాత్రమున ఆతని పురుషరూపమును కోల్పోవునా? కొయ్యతో చేయబడిన ఏనుగ ఏనుగకాదు. అది కాష్ఠమయమే. అట్లే త్రిగుణా తీతుడీ భావమును దార్ఢ్యము గావించుకొనియుండును. బాలుడా కాష్ఠ గజమును ఏనుగగ వ్యవహరించును. క్రీడించును. తృప్తినొందును.

తే. తరుణి వేషంబు గైకొన్న పురుషుడరయ
పురుషుడగుగాక పరికింప తరుణియగునె
జీవభావంబు జేకొన్న కేవలాత్మ
డాత్ముడగుగాక మఱి జీవుడగునె తెలియ

కావున త్రిగుణాతీతుడు ఆ త్రిగుణములకంటె వేరై తన నిజరూప మును దలచి ఆనందించుచు ప్రారబ్ధము ననుసరించి తన దగ్గరకు వచ్చిన ఫలముల ననుభవించును. కర్తయై మాత్ర మనుభవించడు. కాదనడు, రమ్మనడు, కోరడు, కర్తయై భోగించడు మరి ఎట్లుం డును? అది అతనికే తెలియును. ఒరు లెరుగునదికాదు.

శ్లో॥ ఉదాసీన వదాసీనో గుణైర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ 14—23

శ్లో॥ సమదుఃఖ సుఖస్స్వస్థః సమలోష్టాశ్మకాంచనః
తుల్య ప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః 14—24

శ్లో॥ మానావమానయో స్తుల్యః తుల్యోమిత్రారి పక్షయోః
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే॥ 25

అతడు సాక్షిమాత్రుడు. ఉదాసీనుడు. అతని కేమియు సంబంధము లేదు అను మాటలు వాఙ్మయమునం దుండుటను అందరెరుగుదురు. అవి లౌకిక వ్యాపారములందు కార్యములందు కూడ వాడునవియే. సాక్షికి రెండు పక్షములందును కార్యములందు ఎట్టి ప్రవేశమును ఉండదు. అతడా కార్యకర్తలు చేయుదానిని మాత్రము చూచుచుండెను. ఆ రెండు పక్షముల వారి కార్యకలాపములలోని లాభ నష్టములు సాక్షికిలేవు. న్యాయస్థానమున సాక్ష్యము చెప్పు వానిని సాక్షి అందుము. ఆ సాక్షి వంటివాడే త్రిగుణాతీతుడు. త్రిగుణములు క్రీడించును. నవ్వును, ఏడ్చును, పోర్లాడును. వాటి క్రియలను అతడు సాక్షియై చూచును. ఎవరి పక్షమును ఆశ్రయించని వానిని ఉదాసీనుడందురు. ఇక్కడ నీతడు ఉదాసీనుడు. శ్రీకృష్ణులు పాండవుల పక్షములోనివారు చచ్చినను, కౌరవపక్షములోనివారు మరిసినను నొక్కచేసనెను. అభిమన్యుడు పోవుట తన మేనల్లుడు పోవుట కాదు. ఘటోత్కచుడు చచ్చుట తన సైన్యమునకు బలము తగ్గుటకాదు. తనకొక సైన్యములేదు. తన కంటె వేరొకరు లేరు. గోపికలు అద్దములోని ప్రతిబింబములు. బాలుడద్దములోని ప్రతిబింబముతో క్రీడించినట్లే అతడు గోపికలతో రమించెను. కర్తృత్వ భోక్తృత్వములు లేక క్రీడించెను. కావున సదా బ్రహ్మచారియయ్యెను.

ఆయనవంటివారే దూర్వాస మహర్షి. ఆ మహర్షి సదోపవాసి. ఒకప్పుడు గోపికలందరును సమారాధన చేయదలచి ఆ ర్హులగు బ్రాహ్మణోత్తముల చెప్పుమని శ్రీ కృష్ణునడిగెనట. శ్రీకృష్ణుడు ఒక్క విప్రునకు చేయు సమారాధనమే సహస్ర బ్రాహ్మణ సమారాధనయగు నుపాయము చెప్పెదనని దుర్వాస మునీంద్రులకు భోజనము పెట్టుమనెను. అతడు యమునానదీ కవ్వల ఒడ్డునందుండెను. గోపికలు భక్ష్య భోజ్య చోష్య లేహ్యాది పదార్థముల నన్నిటిని తయారుచేసిరి. శ్రీకృష్ణుడు ఆ మహర్షి మన బృందావన మునకు రారు. ఆయనయొద్దకే మీరు వెళ్ళుడనెను. నది అడ్డము గదా? అని గోపికలు ఒకరిమొగ మొకరు చూచుకొనుచుండ శ్రీకృష్ణుడు గోపికలారా! ఆ నదియొడ్డునకు బోయి శ్రీకృష్ణుడు అస్ఖలిత బ్రహ్మచారి యగుచో నీవు మాకవ్వలియొడ్డునకు బోవ త్రోవనీయుమని పలుకుడనెను. వారట్లే చేసిరి. నది పాయనివ్వగా వారవ్వలియొడ్డునకు చేరిరి. మునీంద్రుని జూచి పూజించి, తాము తెచ్చిన సరసాన్నముల నివేదించిరి. అతడు తృప్తిగా నారగించెను. తిరిగి వారు తమ బృందావనమునకు రావలెను. నదీ అడ్డము. ముని వద్కుల నడిగిరి. ఆ ముని దుర్వాస మహర్షివారు సదోపవాసి యగుచో నీవు మాకు దారి యొసగుమని అడుగుడనెను. అందరు వెనుకకు మళ్ళిరి. కాని అందొక ప్రౌఢ గోపిక ధైర్యమునొంది తన సందేహమును బాపుకొనదలచెను.

మునిచంద్రుని ప్రశ్నించెను. గోపికలతో క్రీడించిన శ్రీకృష్ణుడు బ్రహ్మచారియు, పరమాన్నముల భుజించిన మీ రుపవాసితులు ఎలాగైతిరి ? అని.

దుర్వాసులు సమాధానమిచ్చెను.

ఇదం హి మనః తేష్వేవం హిమనుతే తాపెదం గృహ్ణాతి యత్ర హి సర్వమాత్మైవా భూత్తత్ర వా కుత్ర మనుతే క్వ వా గచ్ఛతి? సహి ఆత్మా అహం కథం భోక్తా భవామి"

దృశ్యమంతయు మనస్సు. ఆ మనస్సును పదార్థమే యీ పదార్థములను అనుభవించినది. నేనా మనస్సును కాను. ఆత్మ సర్వవ్యాపకము. అదిలేని అణుమాత్ర ప్రదేశము కూడా లేదు. నేను ఆత్మనై యుండగా దేనిని భుజింతును? అన్నము, అన్నాదమును నేనే అని సమాధానము చెప్పెను. అదియే శ్రీకృష్ణుని క్రీడయుననెను. కావున మేమిద్దరమును భోక్తలము కాము అని సమాధానమిచ్చెనట. కావున త్రిగుణాతీతుడు ఉదాసీనుడై యుండ గుణము లాతని చలింపచేయవు. సుఖ దుఃఖములును అతనికట్టివే. స్వప్నమందు తలతెగి క్రిందపడినది. ఆ విషయము నీయందు స్మృతిమాత్రముగానున్నది. ఆ తెగుట నీవు వేరుగా యుండి చూచుచున్నావు. నీ యనుభవమునకు వచ్చినది. నీ యనుభవము మెలకువయందును అన్వయించుకొంటివి. ప్రహ్లాదుని ఘట్టమంతయు ఈ విజ్ఞానములో చేరినదే. ప్రహ్లాదుని బాధించితినని హిరణ్యకశ్యపుడు తలచెను. ప్రహ్లాదుని దృష్టియందు హిరణ్యకశిపుడు లేడు. అతడు పెట్టు బాధలును లేవు. ప్రహ్లాదుని దృక్పథమున సర్వాధిష్ఠానమగు బ్రహ్మయేయున్నది. అతని వర్ణన యిది.

ఆ॥ విశ్వమందు గన్న విష్ణుయర్థములందు
వస్తుదృష్టిజేసి వాంఛయిడడు
ధరణినాథ దైత్య తనయుండు
హరిపరతంత్రుడై హతాన్యతంత్రుడగుచు

అస్తి. భాతి, ప్రియమని అనునవే ఆత్మ ఉనికియు, ప్రకాశించుటయు ఆనందము అనునవే ఆత్మ లక్షణములు, నామ రూపములు కల్పనలు. సుషుప్తి (గాఢ నిద్ర)యందే దృశ్యములేదో ఆ దృశ్యము జాగ్రత్తునందును లేదు.

వి - గాఢ నిద్రకును, సమాధికిని తేడా ఏమందురు?

కృ - గాఢ నిద్రయందు వాసనాబీజములు అవ్యక్తము నందడగియుండును. జ్ఞానముచేత ఆ వాసనలు దగ్ధమగుటచే సమాధియందజ్ఞానము లేదు. అనుభవరూపమగు ఆత్మ వెలుగొందుచుండును. జాగ్రత్తునందు విశ్వము మరచుటే సమాధి ప్రహ్లాదుని గమనించుము

శా॥ పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మరచెన్ సురారి సుతుడే తద్విశ్వమున్ భూవరా॥

వి - ఇతడు భక్తుడు గదా?

కృ - సర్వాత్మ భావము నొందిన సిద్ధ భక్తికిని జ్ఞానమునకును తేడా లేదు. భక్తుని లక్షణములును త్రిగుణాతీతులు స్థితప్రజ్ఞుల లక్షణములును ఒక్కటే.

వి - అజగర వ్రతమనగా...

కృ - అజగరమనగా కొండచిలువయను ఒక సర్పము. అది కదలలేదు. ఆహారమునకై ప్రయత్నింపదు. కాని అది యాహారమును తినుచున్నది. తన ముఖమువద్దకు వచ్చిన దానినే తినును. దీనివలె ఆహార ప్రయత్నమును కూడ మాని ఆత్మానందమున తృప్తుడై దేహధారియైన జీవన్ముక్తుని దీక్షకు అజగర వ్రతమని పేరు.

ఒక సమయమున ప్రహ్లాదుడు సైన్య సమేతుడై ప్రపంచ రహస్యములనెరుగుటకు పయనమయ్యెను. ప్రపంచము కలయదిరిగెను. సహ్య పర్వత ప్రాంతమున కావేరీతీరమునకు రాగా నివురుగప్పిన నిప్పువలె స్వప్రకాశానందము ననుభవించు మహనీయ మూర్తి యొకడా ప్రదేశమున పరుండి యుండెను. అతని శరీరము ధూళిదూసరితము. అతడు యే వర్ణమునకు చెందినవా డనునది యాతని భౌతిక కాయము నిర్ణయించుటలేదు. వర్ణములకు సంబంధించిన గురుతులు లేవు. మౌనముద్రతో కన్నులు మూయబడియున్నవి. అతడు యే యాశ్రమమునకు చెందీ లేడు. అతడొక మహానిగూఢముగ నున్న దివ్య మునీంద్రుడు అను విషయము ప్రహ్లాదుని వంటి జ్ఞానులు గుర్తించగలరు. మంటియందున్న మాణిక్యమును రత్న పరీక్షకు లెరుగుదురు. ప్రహ్లాదుడు నిశాచరుడు గాడు. అతడు విశ్వవ్యాపి. కావున ఆ మునీంద్రుని పాదములకు ప్రణమిల్లెను. ఆ మునియు ప్రహ్లాదు నెరుగనివాడు కాడు. అద్దమునందు బింబించు నగరమువలె విశ్వమంతయు ఆయోగి హృదయమందలి ప్రతిబింబమే గదా ? ప్రహ్లాదుడు మునిచంద్రా! నీ చరిత్రనంతను నీ యునికి తెలుపుచున్నది. కాని ప్రయత్నము లేని వానికి ధనములేదు. ధనము లేక ఆహారమురాదు. భోగములును అందవు. ఆహారము గొనక తనువు నిలువదు. అయ్యును నీ ఘన తనువు ప్రయత్నరహితమై ఎట్లు నిలిచియున్నదో తెలుపుమనెను. హంస హంసను గుర్తెరుగును. కొంగ కొంగను పలుకరించును. ప్రహ్లాదుని మధురాలాప సుధారస ప్రవాహము ఆ మునిచంద్రుని కర్ణపుటముల ప్రవహించినది. ఆ యోగిపుంగవుని కన్నులను దెరపించినది. మాట్లాడించినది ఆ మహనీయుని ఆత్మ చరిత్ర యిది.

అంత దనేక జన్మలను గడిచి, పశుపక్ష్యాది శరీరములన్నియు వెళ్ళగా చివ్వర కాతడు మనుష్య శరీరమును ధరించెనట ఆ శరీరముతోడ ననేక భోగము లనుభవించెనట. భోగము లన్నిటి యనుభవమును ఎండమావులందలి యుదక పానమని నిశ్చయమైన దట, తాను జీవుడై యున్నది మాయాపురము నందని తెలిసినదట. శరీర పోషణమునకై ధనమార్జించి విల్వ చేసినను తనకది దక్క-దని తేనెటీగలు తనకు పాఠము చెప్పెనట. ఒకప్పు డజగరమును దాని శరీరమును చూడగా అంత స్థూల శరీరము ప్రయత్నము లేకయే పోషింపబడుచుండుట తన కన్నులు తెరిపించినదట. వారి ద్దరు గురువులై నాకీ యజగర దీక్ష నివ్వగా నే నీ విధముగ నుంటి నని యా ముని తన లక్ష్యముల నిట్లు చెప్పెను.

క॥ అజగరమును జూంటీగయు
నిజగురువులుగా దలచి విశ్రాంతుడనై
విజనస్థలి గర్మంబుల గటివిటి
లేకున్న వాడ గౌరవ వృత్తిన్

క॥ లేదని యెవ్వరి నడుగను రాదని
చింతింప బరుల రప్పించినచో
గాదని యెద్దియు మానను ఖేదము
మోదమును లేక క్రీడింతుమదిన్॥

అది అజగరవృత్తి. ఈ వృత్తిని యవలంబించుట భారతీయా ధ్యాత్మిక మిన్ను ముట్టుటయే. యవధూత చర్య అజగర వ్రతమున నడుచుండువాడు భిక్షుకుడు కాడు. ఇతడొక సార్వభౌముడు.

శ్లో|| భూః పర్యంకో నిజభుజలతా కందుకః ఖం వితా నం
దీ పశ్చంద్రో విరతివనితా లబ్ధసంగ ప్రమోదః
దిక్కాన్తాభిః పవనచమరై ర్వీజ్యమాన స్సమంతా
ద్భిక్షు శ్శేతే నృప ఇవ భువి త్యక్త సర్వస్పృహోపి||

భూమియే శయ్య. తనభుజస్కంధములే దిండ్లు. ఆకాశము చాందిని. మింట వెలుగు చంద్రమండలమే దీపము. దిక్కులనెడు కాంతలు దశదిశలనుండియు సురటీలను వేయగా విరతియను వనితా సంగము నొందుచు ప్రమోద సంభరితుడై కోరిక లేమియు లేని భిక్షుకుడు సార్వభౌముడై యానందించుచుండెనట. చూచితివా? భారతీయ వైభవమును ? ప్రపంచాభిముఖుడగు వాడనుభవించు ఆనందములను నూరు చేత హెచ్చించగా హెచ్చించుటకు వీలుకానిది బ్రహ్మానందము. భాగవత పంచమ స్కంధమున ఋషభుని యవతారము వర్ణింపబడినది. నారాయణుడే మేరుదేవికిని నాభియను వానికిని పుత్రుడై జన్మించినట్లున్నది.

ఋషభుడు చక్రవర్తి. తత్వవిదులగు భారతీయ రాజర్షుల కీతడు ఆదర్శమూర్తి యనవచ్చును. ఈయనకు నూర్వురుపుత్రులు. పరమ భాగవతుడై రాజ్యము నేలెను. దేవేంద్రు డీతని యందలి మాత్సర్యముచేత నీతని రాజ్యమందు వర్షాభావమును చేయగా తన యోగశక్తిచేత రాజ్యమును సుభిక్షము గావించిన సిద్ధమూర్తి. రాజ్యము చేయుట ప్రవృత్తిధర్మము. వదలుట నివృత్తిధర్మము. ఈ రెండు ధర్మములను భారతీయ రాజర్షులు అనుసరించినట్లే గీత చెప్పుచున్నది.

"ఏవం పరంపరా ప్రాప్తమిమం రాజర్ష యోవిదుః" అని యున్నది.

ఋషభుడు తన పుత్రుని రాజ్యమునందుంచి నివృత్తి మార్గమున అవధూత యయ్యెను. ఆయన వర్ణన యిట్లున్నది.

దేహ ధర్మములు స్వాభావికములు. నియత ధర్మములు శాస్త్ర సిద్ధములు. శాస్త్రసిద్ధములగు నియత ధర్మములను వీడుటకే సన్యాస మని పేరు. భారతీయ చక్రవర్తులకును, గార్హస్త్యమున అగ్ని హోత్రముల నాచరింపవలెను. ఆ అగ్నులను వదలి అనగా బాహ్య ములగు నగ్నులు ఆత్మకంటె నన్యములు గావు. వాటిని మరల నాత్మయం దారోపించుట ఆత్మ రూపములుగా చూచుట, పారమ హంస్య ధర్మము, ఋషభుడట్లు జేసెను. తన రాజ్యమునువదలెను. దిగంబరుడయ్యెను.

జడాంధ బధిరమూక పిశాచోన్మత్తుల లక్షణములన్నియు నా యవ ధూత మూర్తియందు కనబడుచుండును. పల్లెలచరించును. పుర ముల కేగును. వనసీమల దిరుగును. అతడు దిరుగాడని ప్రదేశ ముండదు. కాని జనుల కెవ్వరికిని మాట పలుకుట యుండదు. కావున జనులాతని మూగయని పరిహసింతురు. దుర్జనులు రాళ్ళ రువ్వుదురు, తిట్టుదురు, కొట్టుదురు, నిందింతురు, ఉమ్మితురు, వెంట నంటుదురు. అల్లరిమూకల యాగడములకు మేర యెక్కడ? అవన్నియు మత్తమాతంగమువలె వదలివేవు నాయవ ధూతమూర్తి నేమిచేయును? ఆతడవధూతమూర్తియని అజ్ఞజను లెరుగరు. జ్ఞానులగువారలిట్లే లోకబాహ్యులై యుందురు. విజయా! దేహాభిమానంబునం జిత్త చలనంబు నొందక యేకాకియై చరియించు

నా యవధూతమూర్తిలోని నిరతిశయ సౌందర్యమంతయు ధూళిచే గప్పబడి యుండెను. అయ్యును, ఆ మూర్తియందలి యవయవ విన్యాసమును, నిగూఢస్మిత వదన విభ్రమంబులును, పరకాంతల చిత్తముల నాకులాయత్తముల గావించుచుండెను. ఆ మదన మోహనమూర్తి మన్మధునకు తండ్రి.

ఆర్యులారా! అతిమాద్యష్ట సిద్ధుఁడను ఆ యోగి పుంగవు వెంట నంటినవి. కాని ఆయనకెందుకు? ఒక్కచో నాతడజగర వ్రత మున బడియుండెను. అన్నపానము లాతనికి ప్రారబ్ధాధీనములు. మూత్ర పురీషముల వదలుటకై వెలుపలకు బోడు. ఆ శరీరము తనలోని మలముల నక్కడనే విసర్జించును. అట్లే ఆహారమును గొనును. ధూళి దూసరితమగు నా దేహము మలభూయిష్ఠమే యయ్యును, మలయమారుతముల వీచుచుండెను. గంధ వహుండా సుగంధశీతలముల గలపి పునీతుడై చరించుచుండె ననుటలో అతిశయోక్తి యేమున్నది? మూత్రపురీషముల వదలుటయు, నాహారమును స్వీకరించుటయు నొక్కచోటనే యొక్క కాలమునే జరుగు చుండుట పశుపక్ష్యాది జంతుధర్మము. అదియే అవధూతల స్థితి యని చాటుచున్న ఋషభుడు గో కాక మృగ చర్యల నడుపు చుండెను. అట్లు కొంత కాలము గడిచినది. కుమ్మరి కుండ చేయుటకై తనచేతి కఱ్ఱతో సారెను గిరగిర త్రిప్పును. దాని వేగమంతవరకేకాదు. అతడు త్రిప్పుట మానినను అదీ కొంత కాలము తిరుగుచునే యుండును. దానికా వేగమెక్కడిది ? దాని పూర్వ భ్రమణమునందొక సంస్కార మున్నది. ఆ సంస్కారమే ఆ చక్రమును త్రిప్పుచున్నది. అట్లే అవతారమూర్తియగు

ఋషభుని యోగ మాయా ప్రభావ సంస్కారము అతనిని ప్రేరే పింపగా నా దేహేంద్రియములు చలింప నారంభించినవి. అత డట నుండి లేచి దక్షిణ కర్ణాటక దేశములకు యధేచ్ఛగ వయ నించెను. ఆ దేశముల నంటియున్న అరణ్య సీమలలో యీ మహ నీయుని సంచారము. ఒకనాటి దావానలమే ఆ మహనీయుని శరీర మును హవిస్సువలె పరిగ్రహించినది. హవ్యవాహనుని యందు ఆహుతియయ్యెను. అంతటితో అతడు ఋషుల కుపదేశింపదలచిన పారమహంస్య ధర్మము సమాప్తమైనది. నేటికిని ఆ దేశస్థులు ఋషభుని దిగంబర ధర్మమునే స్వీకరింతురు. వారు ఋషభుని యందు చూచినది ప్రవృత్తి ధర్మముకాదు. దాని తరువాతి ఉప నిషద్ధర్మము. ఉపనిషద్ధర్మమున సచ్చిదానందమై వెలుగు నాత్మకు కర్మకాండ లేనిమాట నిజమే. ఆ స్థితికి రాని వారు కూడ దీనిని అనుసరించి చెడకూడదు.

శంకరులు జీవన్ముక్త స్థితిని సిద్ధాంతీకరించినారు. కాని వారు పూర్వకాండ యంతయు నొప్పుకొని వ్యావహారికము వందంతయు సత్యమని పరమార్థమున సర్వమత సామరస్యమును నిరుపాధిక విజ్ఞానమును చెప్పిరి. అంతియేగాని శరీరముల దృష్టితో వారే కర్మమును చెప్పలేదు. అంతర్ముఖులైన బ్రహ్మాదుల వర్తన లను తెలిపి, సాధకునికి సాధన భాగముల నుపదేశించిరి. దేహా తీతుల కొక మతము లేదని వ్రాకుచ్చిరి. సాకార నిరాకారములను గురించిన వాగ్వివాదములు లేవు. మోక్ష పురుషార్థ సాధనములు వివాదములకొరకు పుట్టలేదు. సాధకుడు లేక విరక్తుడగువాడు

గురువుల యొద్ద గ్రహించవలసిన అనుభవములే వారి యుపదేశములే వేదాంతములు. యథార్థమగు తత్వమును గుర్తెరిగిన పండితులు ప్రతి దేశము నందును ప్రతి ఉపాధియందును, ప్రతి శాస్త్రము నందును. నామ రూపములను చూడరు. ఆ విధమగు పండితులే త్రిగుణాతీతులు. లేక ప్రౌఢ విజ్ఞానులు, జీవన్ముక్తులు, వారిస్థితి యిట్లుండును అని శంకరులు వర్ణించిరి.

శ్లో॥ మౌనే మౌనీ గుణిని గుణవాన్ పండితే పండితశ్చ
దీనే దీనః సుఖిని సుఖవాన్ భోగిని ప్రాప్తభోగః
మూర్ఖే మూర్ఖో యువతిషు యువా వాగ్మిని ప్రౌఢవాగ్మీ
ధన్యః కోఽపి త్రిభువన జయీ యోఽవధూతేఽవధూతః॥

అతడు గుణవంతులలో గుణవంతుడు. పండితులలో పండితుడు. దీనులలో దీనుడు. యువతులలో యువకుడు. వాచాలురలో ప్రౌఢముగా మాట్లాడును. మూర్ఖుల కాతడును మూర్ఖుడై కన్పట్టును. అందరిలో అందరివలె నుండును. ఏదియును గాక, అన్నియునై అంతటను నిండి త్రిభువన సామ్రాజ్యాధినేతయై విరాజిల్లును. ఇది శిఖరాగ్ర సిద్ధాంతము.

వి - మహాశయా! జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలయందును, మనో వాక్కాయములచేత కర్మలు జరుగుచుండును. ఆ కర్మలకు సుఖ దుఃఖ రూపములగు ఫలము లుత్పన్నమగుచుండును. ఆ కర్మల కెవడు కర్తయో యాకర్తయగువాడా సుఖ దుఃఖ రూప కర్మముల ననుభవించుచుండును. కర్మ శాస్త్రము ప్రమాణము కాగా ఆ శాస్త్రము ననుసరించి, ఆ కర్మను చేయు కర్తను నేనే. ఆ కర్మఫలముల ననుభవించుచున్నది నేనే, అని నిర్ణయించు

కొంటిని ఆ నిర్ణయమునందు నేను జీవుడను, కర్తను, భోక్తను అయితిని. ఇప్పుడు కర్మల నాచరించు కర్తయెవరు? ఆ కర్మ ఫలము లెవనికి భోగ్యములైనవి? అనగా ఆ కర్మఫలముల ననుభవించు భోక్తయెవరు? అను విమర్శ వచ్చినది. ఆ విమర్శకు ప్రమాణ భూతమగు శాస్త్రము ఉపనిషద్భాగమని నిర్ణయించిన అద్వైతాచార్యుల సిద్ధాంతము ననుసరించి తమ బోధామృతమును గ్రోలగా అవిదునాకు అర్థమైన విషయమిదీ.

నేను చేయు కర్మలు త్రిగుణముల వలన సృష్టములై వచ్చిన దేహేంద్రియాది సంఘాతముచే జరుగుచున్నవి ఆ సంఘాతము లోనిదే మనస్సు ఆ మనస్సు అనునదే ఆ కర్మఫలముల ననుభవించుచున్నది. సుఖ దుఃఖరూప ఫలముల నన్నిటికిని భోక్త ఆ మనస్సు. ఇంతకు పూర్వము అనగా గీతామృతబోధకు పూర్వము నేను ఆమనస్సుతో కలిసియుండి మోసపోతిని. ఆ మనస్సను నది మాయాదేవి యొక్క సంతానము. అయ్యేను నేను బంధము నుండి ముక్తుడను కావలెనన్న ఆ మనస్సునదే నాకు సహాయము చేయును అని గ్రహించి, ఆ మనస్సును విషయములనుండి విడదీసి జ్ఞానాభ్యాసము వైపుకు త్రిప్పగా, ఇంతకు పూర్వము అనగా ఈ విమర్శకు పూర్వము ఆ సంఘాతము (దేహేంద్రియముల)తో కలసి, విజయుడనని పేరు పెట్టుకొని కర్తనైతిని, భోక్తనైతిని, సంసారమునందు భ్రమించితిని. నేనీ జన్మకు వచ్చుటకు కారణ మదియే. ఇప్పుడు నేనకర్తను. అభోక్తను. విజయుడని పేరు పెట్టుకొనిన కర్త, మిథ్యాస్వరూపుడు. నేను అనుపదమునకు లక్ష్యమై వెలసినది అఖండము. ఆ అఖండమే నేను. ఇంతకు

పూర్వము వ్యవహరించిన నేను మాత్రము ఈ నేనుసుకాను. జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలయందును, జరుగుచున్న క్రియలను, ఆ క్రియా ఫలములను అనుభవించు సంఘాతమును చూచుచున్న ద్రష్టను, సాక్షిని, ఇప్పటి నేను. సుఖ దుఃఖములు నాకు లేవు. నేను నిత్యానందుడను. జగత్తంతయు నాయందే కల్పితము. నేను కల్పిత సర్పమునకు త్రాడువలె నుంటిని. భూషణ స్వరూపముల నొందిన భూషణముల కాధారమగు సువర్ణము వలె నుంటిని. తరంగముల కాధారమై వెలయు నుదకమువలవంటిదే నా స్వరూపము. నేను లేనిచోటులేదు. సూర్యునిలో చంద్రునిలో తారకలలో వహ్నిలో నేయేల? అన్ని వెలుగులలో వెలుగు వెలుగు లిచ్చియు నేనే. నకు మధ్యలో వచ్చిన జీవత్వమను మజిలీ నుండి మరలితిని. స్వస్థానము చేరితిని. హంసనగు నేను మానస సరోవరమును వదలి నీటికాకినై సంసారగర్తమునందు పడి, గురు వేదాంత వాక్యశ్రవణమువలన మరల పరమహంసనై సద్రూపమగు నా సరోవరమున ప్రవేశించితినని నిర్ణయమైనది. ఇంతియే సందురా?

కృ - ఔను ఇదియే సిద్ధాంతము. పద్మగంధము నాస్వాదింప వచ్చిన తేటి ఆ పద్మగంధము నాఘ్రాణింప కమలము వద్దకు వచ్చును. ఆ కమల ముఖద్వారమున ఝుంకారముల గావించును. మకరంద రసము నాస్వాదించుటకా కమలషండముపై వ్రాలును. అప్పుడు ఝుంకారము లేదు. అమృతరసపానమే. అనుభవమునందు వివాదములు లేవు. పడ్లగింజలు మొలకకు కావలెను. వియ్యము

అనుభవించుటకు కావలెను. వియ్యముకొరకు పై పొట్టును తీసి వేయవలెను. బ్రహ్మానందానుభవము దొరకువరకును శాస్త్రము లాధారములు కాగా అనుభవ రసమును గ్రోలు మహనీయులు శాస్త్రముల మౌనమును పాటింతురు. విజయా ! గీతా శాస్త్రమున నీ సందేహములు దీరినవా ?

వి - "సర్వధర్మాన్ పరిత్యజ్య" యను శ్లోకమునకు మన జ్ఞాన యోగము నం దన్వయమెట్లు?

కృ - భక్తి యోగమునం దెట్లు కుదిరినది?

వి - కించిజ్జ్ఞడనైన నేను సర్వజ్ఞుని శరణు బొందితిని.

కృ - ఇప్పుడా సర్వజ్ఞు డేమయ్యెను? నీవేమైతివి?

వి - మేమిద్దరమును ఏకమైతిమి.

కృ - అదియే శరణాగతి.

వి - పొందుటయన వేరొక వస్తు వుండవలెనుగదా?

కృ - ఈ జ్ఞానయోగమున రెండవ వస్తువు లేదని తెలియుటే పొందుట.

వి - సర్వధర్మ పరిత్యాగ మననేమి?

కృ - ధర్మపరిత్యాగమనగా ఇక్కడ అధర్మముకూడా అ శబ్దము చెప్పు చున్నది. ధర్మాధర్మ ఫలములు రెండును కర్తయై భోక్త యగు వానికే సంబంధించి యుండును. ఇందు గీతాచార్యులు నైష్కర్మ్య మును అనగా ఆత్మ నిష్క్రియ (చలనము లేనిది)మని వివరించి

కర్తృత్వ భోక్తృత్వ ధర్మముల నాత్మయం దారోపింపకపోవుటయే సర్వకర్మ సన్న్యాసమని బోధించెను. త్రిగుణాతీతత్వము, స్థితప్రజ్ఞత్వము, లేక పరాభక్తి అనునవన్నియు సమానార్థములై యీ శ్లోకమున విలసిల్లినవి. కావున మాం- అనగా నిష్క్రియ స్వరూపుడను, సర్వ వ్యాపకుడను, దోషరహితుడను, జనన మరణాదివర్జితుడను అయిన నన్ను అహం రూప బ్రహ్మత్వమును భావింపుము. అనగా నేనే ఆ పరబ్రహ్మను అని తెలిసికొనుము. శరణాగతి యన్నను, సర్వ ధర్మ పరిత్యాగమన్నను నిదియే.

శంకరులిక్కడ మాం- ఏకం - సర్వాత్మానం - సమం-సర్వభూతస్థం-ఈశ్వరం-అచ్యుతం- గర్భజన్మ జరామరణ వివర్జితం అహమేవేతి ఏవం శరణం వ్రజ. న-మత్తః అన్యద స్తీత్యవధారయ అనిరి.

ఇట్టి శరణాగతియందే సమస్త కర్మ బంధములును తెగిపోవును. అమృత మనగా క్షీర సముద్రమునుండి వచ్చినది గాదు. ఆత్మానందమే అమృతపానము. ఇదియే జ్ఞానయోగి పొందునది. జ్ఞాన యోగసారము.

కృ - తరువాత ?

వి - తరువాతది నా ముగ్ధ ప్రణామాంజలియే. నా సందేహములు తీరినవి. గురువర్యా! మన మిద్దరము స్నేహ భావమున గోష్ఠిని ప్రారంభించగా సఖిత్వ గురుత్వములు రెండు నొక్కటై బోధామృతము పండించినవి. ధన్యోఽస్మి! ధన్యోఽస్మి!.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షు రున్మీలితం యేన తస్మైశ్రీ గురవే నమః॥

విజయు డానందబాష్పములతో గురువర్యుని పాద పద్మములను కడిగెను. ఆ వందన సమర్పణతో గీతాహృదయ గోష్ఠి వారికి సమాప్తమైనది.

పాఠకులారా! నేనును జగద్గురువుల కభివందన మాచరించుచు గ్రంథమును ముగింతును.

శ్లో॥ యం బ్రహ్మా వరుణేంద్ర రుద్ర మరుతస్తున్వంతి దివ్యైః స్తవైః
వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయంతియం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినః
యస్యాంతం న విదుస్సురాసురగణాస్తం భావయే సద్గురుమ్॥

ఓమ్ సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై. తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః



